# విచ్ఛిన్న సంసారము

## ప్రతీకారము

రవీంద్రనాథ ఠాకూర్

కారుమూరి వైకుంఠరావు
420 తిరువత్తూరు హైరోడ్
మద్రాసు-21

# వి ష య సూ చి క

# రవీంద్రుని ఇతర గ్రంథములు

## నవలలు

ఇంటా బయటా

పడవ మునక

యోగాయోగములు

ప్రాయశ్చిత్తము

చతురంగము (అచ్చులో ఉన్నది.)

## నాటకములు

గృహప్రవేశం

పోస్టాఫీస్

## కథలు

కథాగుచ్ఛము -

6 సంపుటములు

# విచ్ఛిన్న సంసారము.

భూపతికి ఉద్యోగముచేసి ధనమార్జింపవలసిన అవసరము లేదు. అతడు డబ్బుకలవాడు. దేశముకూడ ఆందోళనతో వేడెక్కియున్నది. కాని భూపతి పుట్టిన నక్షత్రమటువంటిది. ఉద్యోగముచేసే తీరవలెను. కనుక అతడొక ఇంగ్లీషు వార్తాపత్రికను స్థాపించుట తటస్థించినది. అప్పటినుండి కాలమెట్లు గడుపుట యనుచింత లేకపోయినది.

ఇంగ్లీషులో వ్రాయుటకు ఉపన్యాసము లిచ్చుటకు అతడు ఉత్సాహపడుచుండెను. ఎట్టి ప్రయోజనము లేకున్నను ఇంగ్లీషు పేపర్లకు లేఖలు వ్రాయుచుండెను. చెప్పవలసిన దేమియు లేకపోయినను సభలలో మాటలాడక వచ్చువాడు కాడు.

ధనికుడగు భూపతిని తమ సంఘములలోనికి లాగవలెనని రాజకీయసంఘనాయకు లతనిని స్తోత్రము చేయుచుండుటచే భూపతికి తనకుగల ఇంగ్లీషురచనాశక్తి అసాధారణమైనదను అభిప్రాయ మేర్పడినది.

ప్లీడరువృత్తియందు హతాశుడైన బావమరిది ఒకడు భూపతిదగ్గరకువచ్చి ఇట్లు ప్రారంభించెను.—'నీవంటి అసాధారణశక్తికలవాడు ఇంగ్లీషువార్తాపత్రిక పెట్టినయెడల.—"

భూపతికి ఉత్సాహము ద్విగుణితమైనది. ఇతరుల పత్రికలలో లేఖలు ప్రచురించుటలో గౌరవములేదని తోచినది.

సొంతపత్రికలో స్వేచ్ఛానుసారము కలము నడిపించవలెనని కోరిక కలిగినది. బావమరిదిని సహకారిగా చేసికొని భూపతి అల్పవయస్సులోనే సంపాదకుని సింహాసన మెక్కెను.

రాజకీయ మదోన్మత్తత, సంపాదకీయ మదోన్మత్తత అల్పవయస్కులపై గట్టిపట్టు పట్టగలవు. భూపతికి మత్తెక్కించు వారుకూడ అనేకు లుండిరి.

అతడు పత్రికపనిలో మునిగి మైమరచియుండు సమయములోనే భార్య, చారులత, యౌవనమున అడుగుపెట్టినది. వార్తాపత్రిక సంపాదకున కీవార్త సరిగా తెలియలేదు. ఇండియాగవర్న మెంటువారి సీమాంతనీతి మితిమీరఉబ్బి కట్లను త్రెంచుకొనబోవుచుండుటయే అతనిదృష్టిని ముఖ్యముగా ఆకర్షించుచుండెను.

చారులత ధనవంతులయింటి కోడలు-ఆమెకు ఇంటిపనిచేయు అవసరములేదు. ఫలరూపముగ పరిణమింపబోని పుష్పమువలె పనిపాట్లులేక రాత్రింబగళ్లు ప్రయోజనశూన్యమైన పరిపక్వత పొందుచుండుట ఒక్కటియే చారులత పని. ఆమె కెట్టి కష్టములు లేవు, పనిలేదు, లేమిలేదు.

ఇట్టిపరిస్థితులలో మంచి యవకాశము చిక్కినయెడల వధువు భర్తనే తనసర్వస్వముగా చేసికొని రాత్రింబగళ్లు కూర్చుండును; దాంపత్యలీల సీమల నుల్లంఘించుచుండును. అనియమములే నియమము లౌచుండును. చారులత కట్టి యవకాశములు చిక్కలేదు. ఆవరణవలె భర్తను చుట్టపెట్టియున్న

వార్తాపత్రికను ఛేదించుకొనిపోయి అతనిపై అధికారము సంపాదించుట ఆమె కసాధ్యమైనపని.

యువతియగు భార్యవైపు అతని మనసు నాకర్షింపచేయ కోరి బంధువు డొకడు భూపతిని చీవాట్లుపెట్టెను. భూపతి తెలివితెచ్చుకొని, "ఔను నిజమే. 'చారు'కు పనిపాట్లు లేవు. సదా ఒంటరిగా ఉండవలసి వచ్చుచున్నది. జట్టు కెవరైన దొరికినయెడల బాగుండును," అని జబాబు చెప్పెను.

భూపతి బావమరిది, ఉమాపతితో, ఇట్లనెను— "నీభార్యను మాయింటికి తెచ్చి ఇక్కడనే ఉంచినయెడల బాగుండును. ఈడువా రెవ్వరును లేకపోవుటచేత చారుకు కష్టముగా నుండవచ్చునని నాకు తోచుచున్నది."

తనతోటివా రెవరును దగ్గరలేకపోవుటయే చారు దుఃఖమునకు కారణమని సంపాదకుని అభిప్రాయము. కనుక బావమరిది భార్య, మందాకిని, వచ్చి తమయింట కాపురము పెట్టినప్పటినుండి అతడు నిశ్చింతగా కూర్చుండెను.

భార్యాభర్తలలో మొదట ప్రేమోదయమయినప్పుడు వారి ప్రపంచమును నింపిన అరుణరాగము చిరనూత్నముగా కనబడుచుండును. అట్టి దాంపత్యస్వర్ణప్రభాతము ఎప్పుడువచ్చి ఎప్పుడుపోయినదో వీరికి చైతన్యమే కలుగలేదు.

నూతనత్వముయొక్క రుచిచూడకయే, వీరు అన్యోన్య పరిచితులయిపోయిరి, పాతబడిపోయిరి.

చారులతకు చదువు సంధ్యలయెడల ఆసక్తియుండుటచే కాలముగడపుట కష్టముగా తోచలేదు. ఆమె నానాయుక్తులు పన్ని చదువునేర్చుకొను ప్రయత్నము చేయుచుండెను. భూపతి మేనత్తకొడుకు, అమల్, బి. ఏ. క్లాసులో చదువుచుండెను. ఇతని సహాయమువల్ల చారు చదువు నేర్చుకొనుచుండెను, ఆకాస్తసహాయమునకై అమలుని మురిపింపు లెన్నో చారు సహించియుండవలసి వచ్చినది. ఇంగ్లీషు సాహిత్య గ్రంథాలు కొనుక్కొనుటకు, హోటేల్‌లో ఫలాహారము చేయుటకు చారు తరుచుగా డబ్బీయవలసివచ్చుచుండెను. అమల్ అప్పుడప్పుడు తనమిత్రులను విందున కాహ్వానించుచుండెను, దానికి అగుఖర్చు గురుదక్షిణారూపముగా చారే భరించుచుండెను. చారుపై భూపతి ఎట్టి యధికారమును చలాయించువాడు కాడు. కాని ఆకాస్త చదువుచెప్పుటవలన అమలుడు సంపాదించిన హక్కులకు మితిలేదు. అమలుని వ్యవహారముచూచి మధ్యమధ్య చారు కోపము నటించుచుండెను. కాని ఇతరుల కేదో కొంత ఉపయోగపడుట, అనురాగముకొలది చేయుఅల్లరి సహించియుండుట, ఆమె సుఖమున కత్యావశ్యకమైనవి.

అమల్ ఒకనాడు చారుతో నిట్లనెను—"వదినా, రాజుగారి అల్లుడు పూలల్లికజోడు తొడుగుకొని మాక్లాసుకు వచ్చుచున్నాడు. రాణి దానిని స్వహస్తములతో అల్లినది.

అదిచూచి నేను సహించలేకున్నాను. నాకుకూడ అటువంటిది కావలెను. లేనిచో నాగౌరవము నిలబెట్టుకొనలేను."

చారు—"ఆహా సందేహ మేమి! నీకొరకు జోళ్లల్లుచు కూర్చొని నేను చావవలెను, కాదా! రూపాయ లిచ్చెదను, బజారుకుపోయి ఒకజోడు కొనితెచ్చుకొనుము."

అమల్—"అట్లు పనికిరాదు."

పూలుఅల్లుట చారుకు చేతకాదు. ఆమాట ఒప్పుకొనుటకు చారు కిష్టములేదు. ఇంకెవరికోర్కె నెరవేర్చుచక పోయినను చారు తనకోర్కెమాత్రము తీర్పక నుండజాల కూడదని అమలుని ఇచ్ఛ. అమల్ కాలేజిలో నుండుసమయములో చారు రహస్యముగా బహుప్రయత్నముచేసి జోడల్లిక నేర్చుకొన్నది. అనేకదినములు గడిచిపోయినవి. అమల్ ఆజోడుమాట పూర్తిగా మరిచిపోయినతరువాత ఒకనాటి సాయంకాలము చారు అతనిని అంతఃపురములోనికి ఫలాహారమునకై పిలిపించినది.

వేసవికాలము డాబామీద ఫలాహారమున కేర్పాటు జరిగినది. ఫలాహారముపై దుమ్ముపడకుండునట్లు కంచముమీద ఇత్తడి మూత బోర్లించబడియున్నది. అమల్ కాలేజినుండి వచ్చి ముఖము కడుక్కొని, దుస్తులు మార్చుకొని అత్యాడంబరముగా ఫలాహారమునకు లోపలికి వచ్చెను.

ఆసనముమీద కూర్చొని ఇత్తడిమూత తీయగానే కంచములో చక్కని పూలుజోళ్లజత కనబడినది. ఎదుట నిలిచియున్నచారు పకపక నవ్వనారంభించినది.

జోళ్లు దొరికినప్పటినుండి అమలుని కోర్కె లధిక మగుచు వచ్చినవి. మెడకుచుట్టుకొనుపూలు కంఫర్ట రొకటి కావలెనట. లతయల్లిన పట్టురుమాలు, బయట కుర్చీవీపుపై డాగుపడకుండునట్లు వేసికొనుటకు అల్లికపనిచేసిన రుమాలు అవసరమైనవి.

అమల్ క్రొత్తవస్తువును కోరినప్పుడెల్ల చారు అతనికి చీవాట్లుపెట్టి కలహించుచుండెను. కాని చిట్టచివరకు శ్రమపడి అతని కోరికలన్నిటిని నెరవేర్చుచుండెను.

మధ్యమధ్య పని ఎంతదూరము నడిచినదని అమల్ అడుగుచుండును. "ప్రారంభము కాలే" దని చారు జబాబు చెప్పుచుండు నొకమారు, "నాకది జ్ఞాపకమేలే,"దని చెప్పు చుండును మరియొకమారు.

కాని కోరికను విడచువాడుకాడు అమల్ - మురిపింపు లతో ప్రతిదినమును జ్ఞాపకముచేయుచుండును. అమల్ పట్టిన పట్టు వదలువాడు కాడని ఎరిగి అతడు చేయబోవు అల్లరిని చూచి ఆనందింపకోరి చారు ఔదాసీన్యము నటించుచుండెను. చివరకు అతడు కోరినవస్తువు సిద్ధముకాగానే దాని నతని కిచ్చి అతని ఉత్సాహమునుచూచి చారు ఆమోద మొందుచుండెను.

చారు గొప్పయింటికోడలు. ఎవరికొరకైన నెట్టిపనియైన చేయుట కవసరముండునది కాదు. అమల్ మాత్ర మామెచే నేదో యొకపని చేయించక వదలువాడు కాడు. కాని ఆ చిన్న

చిన్న పనులు చేయుచుండుటవల్లనే ఆమె హృదయవృత్తులు చరితార్థత పొందుచుండెను.

ఇంటి అంతఃపురమునయున్న చిన్నస్థలమును ఉద్యాన మని వర్ణించుట కేవల మతిశయోక్తి - అక్కడనున్న చెట్లలో ముఖ్యమైనది సీమఉసిరికచెట్టొకటి. ఆస్థలమున ఉద్యాన మొకటి నిర్మించ నిశ్చయించి ఒకకమిటీని ఏర్పరచిరి.

చారు, అమల్—వీరిద్దరు ఆకమిటీసభ్యులు ప్రతిదిన మును ఇద్దరును కలసి ప్లాన్లువ్రాసి కొలతలువేసి అత్యుత్సా హముతో వాదించుచు కొన్నాళ్లు గడిపిరి.

అమల్—"ఆకాలపు రాజకన్యకవలె నీవు స్వహస్త ముతో చెట్లకు నీరుపోయుచుండవలెను వదినా."

చారు:—"ఆమూలను చిన్నకుటీర మొకటి వేయ వలెను. దానిలో లేడిపిల్ల నుంచవచ్చును."

అమల్—"చిన్నకొల నొకటికూడ నుండవలెను. హంస లందులో ఈదుచుండును."

"అందులో నీలపద్మములను వేయవలెను. నీలపద్మములు చూడవలెనని నాకెంతో కాలమునుండి మిక్కిలి కోరికగా నున్న" దని చారు అత్యంతోత్సాహముతో నన్నది.

అమల్—"కొలనుపైని చిన్నవంతెన కట్టించినయెడల ఎంతో అందముగా నుండును. రేవులో చిన్ననావ నుంచుదము."

చారు—"రేవు తెల్లమార్బిల్‌తో కట్టించవలెను."

అమల్ కాగితము పెన్సిల్ తెచ్చి గీర్లుగీసి అత్యాడంబర ముగా మ్యాప్ ఒకటి తయారుచేయ మొదలుపెట్టెను. గీసినది రద్దుచేసి కొత్తప్లానును వ్రాయుచుండిరి, దానిని దిద్ది మరి యొకటి—అట్లు గీసిగీసి పాతికముప్పది మ్యాపులు తయారు చేసిరి.

ప్లాను సిద్ధమైన తరువాత ఎస్టిమేటుచేయ ప్రారంభించిరి. స్వంతఖర్చుకై చారుకు నెలనెలకు కొన్నిరూపాయ లిచ్చుచుం డుట ఆయింటి పద్ధతి. ఆరూపాయలతోనే కొంచెము కొంచె ముగా *బాగాణ సిద్ధపరచవలెనని వారి ఉద్దేశము. అంతఃపుర మున ఎక్కడేమిజరుగుచున్నదో భూపతి ఎరుగడు. ఎన్నడో కాని అత డింట్లోనికి వచ్చువాఁడుకాడు. బాగాణ పూర్తియైన తరువాత చారు ఒకనా డతనిని అంతఃపురములోనికి ఆహ్వానించి, ఆ యద్భుతసృష్టిని అతనికి హఠాత్తుగ చూపించి విస్మితునిచేయ దలచినది. దానినిచూచి అది అల్లా-ఉద్-దిణ లాంతరు సహా యమువల్ల జపాన్‌దేశమునుండి వచ్చిన ఉద్యానమని భూపతి అనుకొనకమానడని, చారు ఊహించినది!

ఎస్టిమేట్ ఎంతతగ్గించినను తన పైవేటుఖర్చులరూపా యలతో ఆ బాగాణ తయారుచేయుట అసాధ్యమని చారు పోల్చుకొన్నది.

"అట్లైన ఆకోలలను మాని వేద" మని అమలనెను. చారు "కోలలను మానుట కెంతమాత్రము వీలులేదు, కోలలను లేనియెడల నానీలిపద్మము లెక్కడుండును?"

---

* ఉద్యానము.

అమల్—"నట్లైన 'లేడిపిల్ల కుటీరము' డాబాగాచేయక గడ్డియిల్లుగా ఉంచవలె.

"అట్లైన నా కాకుటీరమే అవసరములేదు," అని కోపముతో జబాబుచెప్పినది చారు.

మారిషస్‌నుండి లవంగపు అంటు, మైసూరునుండి చందనము, సింహళమునుండి దాల్చిని మొదలైనవి తెప్పించవలెనని మొదట వారిసంకల్పము. వానికి బదులు మానిక్‌తలానుండి దేశిఅంట్లను కొన్ని తెప్పించవలసియుండునని అమల్ అన్నాడు. చారు ముఖముభారముచేసికొని, "నాకటువంటి ఉద్యానమవసరమే లే"దని యన్నది. ఎస్టిమేటుతోపాటు ఊహనుకూడ తగ్గించుటకు చారు కెంతమాత్ర మిష్టములేకపోయినది. బయటి కేమిచెప్పినను ఇట్లు తగ్గించుట అమలునకుకూడ రుచికరముగ లేకుండెను.

అమల్—"అట్లైన నీవు అన్నయ్యతో చెప్పు వదినా. అన్నయ్య కావలసిన రూపాయలు తప్పక యిచ్చును."

చారు—"దానిలో ఆనంద మేమున్నది. ఆయనతో చెప్పినయెడల దొరలకంపెనీకి ఆర్డరిచ్చి గొప్ప *"ఇడెన్‌గార్డెన్స్" తయారుచేయించగలడు. అప్పుడు మనప్లాను ఏమైనట్లు ?"

చారును అమలుడును—జామచెట్టుక్రింద కూర్చొని నిర్మించబోవు ఉద్యానమును గురించి ఊహించి ఆనందించుచుండువేళ

---

* కలకత్తాలోనున్న సుందరమైన పెద్దఉద్యానము.

చారుమరదలు, మంద, మేడమీదినుండి, "ఇంతవేళ అయినది, తోటలో కూర్చొని మీరేమిచేయుచున్నా"రని, కేకవేసినది.

"పలుకపారిన కాయలకొరకు వెదుకుచున్నాము," అని చారు జబాబువచ్చినది.

"దొరికినట్లైనా నాకొరకుకూడా నాలుగు తీసుకొనిరా," అని మంద అన్నది.

చారు నవ్వినది, అమల్ నవ్వెను. వీరిసుఖమునకు ప్రధానకారణము తమ రహస్యములు తమ ఇద్దరికేతప్ప మరి యెవ్వరికిని తెలియకుండుట. మందాకినికి ఇంకేసుగుణమున్నను లేకున్నను ఊహాశక్తిమాత్రములేదు. అటువంటప్పుడు వీరి ప్రస్తావములయందుండు రసమామె ఎట్లు గ్రహించగలదు ? కనుక ఆ కమిటీసభ్యులిద్దరి యాలోచనలలో నామెకు తావు లేదు.

ఆ సాధ్యాతీతమైన ఎస్టిమేటు తగ్గించలేకపోయిరి. ఊహాలుకూడ క్రిందికి దిగనన్నవి. కనుక వారి కమిటీ సభలు అదేవిధముగా ఆచెట్టుక్రిందను మరి కొన్నాళ్లు జరిగినవి. బాగాన్‌లో ఎక్కడ కొలను తవ్వించవలెనో, ఎక్కడ కుటీరము వేయించవలెనో, ఎక్కడ మండపము కట్టించవలెనో ఆయా స్థలములలో అమల్ గీట్లుగీసి అంతయు సిద్ధపరచియుంచెను. ఇట్లుండ ఒకనాడు చెట్టుక్రింద కూర్చొని చారు హఠాత్తుగా— "నీకు కవిత్వము చేతనయియుండినయెడల ఎంతబాగుండును!" అని యన్నది.

"ఏమిటి ఆబాగు ?"

"మన ఉద్యానవర్ణనతో నీచేత కథ ఒకటి వ్రాయించి యుందును. అందులో మనకొలను, లేడిపిల్లకుటీరము, తెల్ల మార్బుల్ రేవు వర్ణించియుందువు; ఆవర్ణన బోధపరచుకొను వారము మనమిద్దరమే, చాల తమాషాగా ఉండును—ప్రయత్నముచేసిచూడుము అమల్, తప్పక వ్రాయగలిగెదవని నా నమ్మకము."

"సరే అయితే, వ్రాయగలిగితే నాకే మిచ్చెదవు ?"

"నీ కేమి కావలెను?"

"నా దోమతెర మీదిగుడ్డపైని పెనసలుతో లతలు గీసి ఇచ్చెదను, వానిని పట్టుదారముతో నీవు కుట్టి ఈయవలెను."

"నీకోరికలన్నియు అటువంటివే! దోమతెరమీద పట్టు సెలత లెక్కడైన చూచితివా?"

దోమతెర ఒకసౌందర్యరహితమగు కారాగృహము కాదని సూచించుచు చాల సంగతులుచెప్పి అమల్ ఇట్లనెను— "లోకములో నూటికి తొంబదితొమ్మండుగురికి సౌందర్య జ్ఞానము లేదు. అందము లేని వస్తువులనుచూచినప్పుడు వారికి విసుగు కలుగకుండుటయే నేనను దానికి ప్రమాణము."

అతని వాదములోనుండు సత్యమును చారు తత్ క్షణమే గ్రహించినది. తమ రహస్యసంఘములోని సభ్యులిద్దరును ఆ మూఢులగు తొంబదితొమ్మండుగురిలో చేరనివారని తెలిసి

కొని ఆనందించి, "సరే, దోమ తెరమీాద లత అల్లెదను, నీవు కవిత్వము ప్రారంభించు" మని యన్నది.

"నాకు కవిత్వము చేతకాదనుకొనుచున్నావా?" అని అమల్ రహస్యమేదో చెప్పుచున్నట్టుగా చారుతో ననెను.

"అట్లైన నీవేదో వ్రాసేయున్నావు, నాకది చూపించు," అని మిక్కిలి ఉత్తేజముతో చారు తొందర పెట్టుట ప్రారంభించినది.

"నేడు వద్దు వదినా."

"నేడే చూపించవలెను, అమల్ వెళ్లు—తత్ క్షణమే తీసికొని రమ్ము."

తన రచనను చారుకు చూపింపవలెనను కోరికను అమల్ ఎన్నాళ్లనుండియో అణచిపెట్టుకొని యుంచెను. చారుకు తన రచనబోధపడకపోవచ్చును, లేదా ఆమె కది ఉత్తమ రచనగా తోచకపోవచ్చునని అతడు సంకోచించుచుండెను.

నేడు రచనను తీసికొనివచ్చి, ముఖమెఱ్ఱచేసికొని, కొంచెము దగ్గి, గొంతుక సవరించుకొని చదువుట ప్రారంభించెను. చారు చెట్టుమొదలుపై చేరపడి, కాళ్లుచాచుకొని వినుటకు కూర్చుండెను.

ఉపన్యాస విషయము, "నానోటుబుక్కు"—అమల్ ఈ విధముగా ప్రారంభించెను—"ఓ నా తెల్లని నోటుబుక్కా, నాఊహ నిన్నింకను స్పృశింపలేదు. అదృష్టపురుషుడు సూతికా గృహమందు ప్రవేశించక పూర్వము శిశువుయొక్క లలాట

ఫలకమువలె నీవింతవరకు నిర్మలమై రహస్యమయమైయున్న దానవు. నీ చివర పుటలో కడపటిపంక్తి నేను వ్రాయగల దినమెప్పుడో! నీశుభ్రశిశుపత్రములు ఆ మసీచిహ్నిత సమాప్తిమాట ఊహించనైనలేవు." ఇదే ధోరణిని అమల్ ఏమేమో వ్రాసుకుపోయెను.

చారు చెట్టుమొదట నిశ్చలముగ కూర్చుండి విని ఉపన్యాసము ముగిసిన తరువాత కొంతసేపూరుకొని, "అమల్, నీవింకా వ్రాయలేవూ?" అని అడిగినది.

అమల్ సాహిత్యమదిరరసమును రుచిచూచుట ఆనాడే మొదలు, ఆనాడతనికి సఖిగానున్నయామె యువతి. రుచి క్రొత్త, రసనము నవీనము, అపరాహ్ణ దీర్ఘచ్ఛాయలచే దినమును రహస్యమయము!

"నాలుగు పలకుపారిన జామికాయలు తీసికొని పోదము—లేనియెడల మందకేమి చెప్పగలము?" అని చారు అన్నది.

మందాకిని మూఢురాలు. చదువుసంధ్యలమాట, సాహిత్యచర్చమాట ఆమెతో చెప్ప బుద్ధిపుట్టదు—కనుక నాలుగు జామికాయలు కోసితీసుకొనిపోవలసి వచ్చినది.

ఉద్యానము నిర్మించవలెనను సంకల్పము వారి యితర సంకల్పములతోపాటు సీమాహీన ఊహాలోకములో ఏమూలను మాయమైనదో చారుగాని అమల్గాని గమనించలేదు.

ఇప్పుడు వాదించుచుండు ప్రధానవిషయము అమలుని రచన—అమల్ మధ్యమధ్యవచ్చి, "అతి చిత్రమైన భావ మొకటి తలలోకి వచ్చినది వదినా," అని అనుచుండును.

ఉత్సాహముతో చారు జవాబుచెప్పుచుండును—"దక్షిణపు వరండామీదికి పోదముపద, ఇప్పుడే మంద ఇక్కడికి తాంబూలము సరుదుటకు వచ్చును."

వరండామీద చింకిబెత్తుకుర్చీవేసుకొని చారు కూర్చుండును. వరండా జాలుదగ్గర ఎత్తైన జాగా ఒకటిచూచి కాళ్లు చాచుకొని అమల్ కూర్చుండును.

రచనా విషయములు స్పష్టమైన ఆకారముగలవికావు. కలగాపులగముగా అమల్ వ్రాసినది ఎవరికిని స్పష్టముగా బోధపడునదికాదు. ఉండియుండి అతడే, "దానిలోనిభావము నీకు స్పష్టముగా బోధపరచలేను వదినా," అనుచుండును.

"లేదు లేదు, చాలావరకు బోధపడినది. అదే ధోరణిని వ్రాసుకొనిపొమ్ము, ఆలస్యముచేయకు" మని చారు ఉత్సాహపరచుచుండును.

చారు కొంతబోధపరచుకొని, కొంతబోధపరచుకొనలేక, కేవలము ఊహించుకొని, అమలుని ఆవేగముచే ఉత్సాహము పొంది తనమనస్సులోని భావములకొక ఆకారము నిచ్చి ఆనందించుచుండెను.

ఆనాటిరెండవపూటనే "ఎంతవరకు వ్రాసినా," వని అడుగుచుండును.

"ఇంతలో నేమి వ్రాయగలను?" అని అతడు జవాబిచ్చుచుండును.

ఆ మర్నాడే కొంచెము పోట్లాటస్వరముతో, "ఏదీ, అది ఇంకా వ్రాయలేదే!" అని చారు అడుగుచుండును.

"మరికొంచె మాలోచించవలె" నని అమల్ ఉత్తర మిచ్చుచుండును.

"అయితే నీవు వ్రాయనవసరములేదు." అనును చారు.

సాయంకాలమునకు ఆకోపము బలిసి చారు మాటలాడుట మానునప్పటికి, అమల్ జేబురుమాలు తీసి కొనుచున్నట్లు నటించి వ్రాసి జేబులోనుంచుకొని వచ్చిన తనరచన చారు కంటపడు నట్లు చేయుచుండును.

చారు మౌనవ్రతభంగముచేసికొని, ఉత్సాహముతో, "అదిగో వ్రాసి నాదగ్గరదాచుచున్నావు; చూపించు" అని అనుచుండును.

అమల్—"ఇంకా పూర్తికాలే" దనువాడు.

చారు—"పనికిరాదు, ఇప్పుడే చదివి వినిపించవలెను."

అమల్ కూడ వినిపించవలెనని ఆతురపడుచుండును. కాని లేదులేదని ఆమె ఉత్సాహమును పెరిగించనిదే వినిపించు వాడుకాడు. అటుపిమ్మట కాగితములను చేతితో సాఫుచేసి పెనసలుతీసి రెండుమూడుస్థలములలో దిద్దుచుండును. అంతలో చారుమనస్సు పులకితమై జలభారముచే క్రిందికి వ్రేలాడు మేఘమువలె ఆకాగితములపై వ్రేలాడుచుండును.

ఎప్పటికి ఏరెండుపేరాలు సిద్ధమౌనో అవి చారుకు విని పింపకతీరునది కాదు. వ్రాయబోవుదానినిగూర్చికూడ ఇద్దరును కూర్చొని వాదించి ఆనందించుచుండువారు.

ఇప్పటివరకు వారు ఆకాశకుసుమములు కూడబెట్టు ప్రయత్నములో నుండిరి. ఇప్పుడు కావ్యకుసుమమును సృష్టించు ఉద్యమములోనికి దిగి సర్వమును మరచిరి.

ఒకనాటిసాయంకాలము అమల్ కాలేజినుండి ఇంటికి వచ్చునప్పటికి అతని జేబు నిండుగా ఉన్నట్లు కనబడినది. అంతఃపురములో కిటికీదగ్గర నిలుచొనియున్న చారు ఇది కనిపెట్టినది. అమల్ ప్రతిదినము కాలేజినుండిరాగానే ఇంట్లోనికి వచ్చుచుండువాడు. కాని నేడు నిండుజేబుతోవచ్చిన అమల్ తన బయటి గదిలోనుండి అంతఃపురములోనికి ఎంతసేపటికిని రాలేదు.

చారు అంగణమువరకువచ్చి చప్పట్లుకొట్టినది. కాని ఎవరును వినిపించుకొనలేదు. చారు కోపముతో తిరిగివచ్చి, కవితాగ్రంథ మొకటి చేతపుచ్చుకొని వెనుకవరండామీద కూర్చొని చదువ ప్రయత్నించుచున్నది.

గ్రంథము మన్మథదత్త అను ఒక నూతనకవిది. అతని రచనాధోరణి చాలవరకు అమల్ రచనమాదిరిదే. కనుక అమల్ ఎన్నడును అతనిని పొగడువాడుకాడు. అతనిరచనను అప్పుడప్పుడు చారు ఎదుట వికృతోచ్చారణతో వేళాకోళముగా చదువుచుండువాడు. చారు చీకాకుపడి పుస్తక మతనిచేతిలోనుండి లాగుకొని దూరముగా పారవేయుచుండును.

నేడు అమలుని అడుగులచప్పుడు వినగానే చారు ఆమన్మథదత్తుని గ్రంథముతీసి అందులో "కలకండ" అనురచన ఏకాగ్రచిత్తముతో చదువుట ప్రారంభించినది.

అమల్ వరండామీదికి వచ్చెను; చారు అటువైపు చూడకుండుట కనిపెట్టి "ఏమి చదువుచున్నావు వదినా?" అని యడిగెను.

చారు జబాబు చెప్పలేదు, అమల్ చారు వెనుకకువచ్చి నిల్చొని "మన్మథదత్తుని † గలగండ!" అని అన్నాడు.

చారు, "అబ్బా! చీకాకుపెట్టకు నన్ను చదువుకోనీ," అని యన్నది; అమల్ వెనుకనుండి వెటకారముగా కొన్ని పంక్తులు ఆపుస్తకములోనుండి చదివి, చివరకు తన సొంత కవిత్వము కొంత ప్రారంభించెను.

కుతూహల మధికమగుటచే చారు కోపము నటించలేక, పుస్తక మటుపారవేసి నవ్వుచు, "నీకు చాల ఈర్ష్య, నీ కవిత్వము తప్ప మరియేదియు నీకు నచ్చదు," అని అన్నది.

"నీది అత్యుదారచిత్తము కాదా?"

చారు—"ఆహా నిజమే, కాని వెటకారము చాలించి జేబులో నున్నదానిని బయటికి తీయుమయ్యా."

అమల్—"ఏమున్నదో చెప్పుకో!"

---

† బంగాళీభాషలో మెడవాపుతోకూడిన ఒక రుగ్మత పేరు.

చారును చాలసేపటివరకు చీకాకుపెట్టి చివరకు, అమల్ "సరోరుహము" అని పేరుగల విఖ్యాతమాసపత్రిక ఒకటి జేబులోనుండి తీసెను."

ఆపత్రికలో అమల్ వ్రాసిన "నానోటుబుక్కు" అను వ్యాసము వెలువడినది. చారు ఏమియు అనలేదు, దానిని చూడగానే చారు మిక్కిలి ఆనందించునని అమల్ ఆశించుచుండెను. కాని చారుముఖమున ఆనందచిహ్నము లేవియు కానరాకుండుట చూచి, "సామాన్య వ్యాసము లేవియు సరోరుహములో ప్రచురింప" రని అనెను.

అమల్ చెప్పినది నిజముకాదు, ఏమాత్రము చదువదగినదైన వదలువాడుకాడు దాని సంపాదకుడు. కాని అతడు అతికఠినపరీక్ష చేసి నూటిలో ఒక్కవ్యాసము నెంచుచుండునని అమల్ చారుకు బోధపరచెను.

విని చారు సంతోషింప ప్రయత్నించినది కాని ఆమెకు లేశమైన నానందము కలుగలేదు. దేనివల్ల ఆమె మనస్సునకు కష్టము కలిగినదో తెలిసికొన ప్రయత్నించినదికాని సబబైన కారణము తట్టలేదు.

అమలుని కవిత్వము అమల్ చారు—వీరిద్దరి ధనము మాత్రమే—అమల్ లేఖకుడు, చారు పాఠకురాలు—దాని యందుండు ప్రధానరసము ఇది గుప్తధనముగా నుండుటయే. ఆరచన నందరును చదివి అందరును పొగడుదురను తలంపు చారు

మనస్సున కేల అంత బాధకల్గించినదో ఆమెకు స్పష్టముగా బోధపడ లేదు.

కాని లేఖకుని కీర్తికుసుద ఒక్క పాఠకుడు అనేకదినములు తీర్చుచుండలేదు. అమల్ తనరచనలను అచ్చొత్తించుట ప్రారంభించెను, ప్రశంసకూడ పొందుచుండెను.

పాఠక భక్తులయొద్దనుండి అప్పుడప్పుడు జాబులుకూడ వచ్చుచుండెను, అమల్ వానిని చారుకు చూపించుచుండెను. అవి చదివి చారు ఆనందించుచుండెను. ఆమెమనస్సుకు కష్టము కూడ కలుగుచుండెను. వ్రాయుమని పురికొల్పుటకు ఇప్పుడు చారు అవసరములేదు. అప్పుడప్పుడు పేరుఊరులేని స్త్రీల దగ్గరనుండికూడ అమలుకు జాబులు వచ్చుచుండెను. వాని విషయమై అమలుని చారు ఎగతాళిచేయుచుండెను కాని అవి చూచి చారుకు ఆనందము కలుగునదికాదు. వారి కమిటీ యొక్క రుద్ధద్వారము తెరుచుకొనిపోయినది. దేశమునందు పాఠకబృందము వారిరువురిమధ్యను అడ్డుగ వచ్చి నిలిచిరి.

ఒకనాడు తీరుబడిగా ఉన్నప్పుడు భూపతి ఇంట్లోనికి వచ్చి, "మన అమల్ ఇంత చక్కగా వ్రాయగలడని నే ననుకొన లేదు చారూ!" అని యనెను.

భూపతి పొగడుటచూచి చారుకు సంతోషము కలిగినది. అమల్ భూపతియాశ్రితుడు, కాని ఇతరయాశ్రితులకు ఇతనికి పెద్దభేదమున్నదని భూపతి తెలిసికొనెనని విని చారుకు

కొంచెము గర్వము కలిగినది. చారు అమలునియెడల అంత ఆదరాభిమానములు కలిగియుండుటకు కారణము వా రింత కాలమునకు పోల్చుకొన్నారని తెలియుటయే, ఆమెగర్వమునకు కారణము—తా నమలుని విలువ అనేకదినములకు పూర్వమే పోల్చుకొన్నదనియుండుట. అమల్ సామాన్య లేఖకుడు కాడనియు అతడు నిరసన కర్త కాడనియు ఆగర్వమున కర్థము.

చారు—"అతని వ్యాసములు నీవేవైన చదివితివా†?"

భూపతి — "చదివితిని — లేదు లేదు — సమయము చిక్కుట లేదు, మన నిశికాంతుడు చదివి చాలా పొగుడు చున్నాడు - అతడు చక్కగా బోధపరచుకొనగలడు." అమల్ విషయమై భూపతికి మంచి అభిప్రాయము కలుగవలెనని చారుకు తీవ్రమైన కోరికయుండెను.

వార్తాపత్రికకొనువారికి కొన్ని బహుమానము లిచ్చు చుండినయెడల పత్రికప్రచురణవలన లాభము దొరకునని ఉమాపదుడు భూపతికి బోధపరచుచుండెను. బహుమాన ములు నష్టము నెట్లు తగ్గించగలవో భూపతి ఎంతప్రయత్నించి నను బోధపరచుకొనలేకపోయెను.

---

† బంగాళాదేశములో ముఖ్యముగా శిక్షితసంఘములో, భర్త భార్యను 'నీవు' అని సంబోధించునట్లే భార్యకూడ భర్తను సంబోధించును. తెలుగు దేశస్థులవలె భార్య భర్తను 'ఏమండీ' అనుట భర్త భార్యను 'ఏమే' అనుట వారి సంప్రదాయముకాదు.

చారొకసారు గదిలోనికివచ్చి ఉమాపదు డుండుట చూచి బయటికి వెళ్లిపోయినది. కొంతసేపైనతరువాత మరల వచ్చిచూచునప్పటికి ఇద్దరును లెక్కలుచూచుచు వాదించు చున్నారు.

చారు చీకాకుపడుచుండుట చూచి ఉమాపదు డేదో నెపముపై బయటికి వెళ్లిపోయెను. లెక్కలతో భూపతి తల కలతచెందుచున్నది.

చారు గదిలో ప్రవేశించి ఇట్లన్నది—"మీ లెక్క లింకా తేలలేదు కాబోలు, ఆపత్రికతో రాత్రింబగళ్లు గడుపుచున్నారో నాకేమీ బోధపడకున్నది."

భూపతి జమాకర్చులచిత్తాల నటుత్రోసి కొంచెము నవ్వి తనలో తా నిట్లనుకొనెను—"చారునుగురించి ఆలోచించుటకైన నాకు సమయములేదు, చాలా అన్యాయము! పాప మామె కాల మెట్లు గడపగలదు!"

భూపతి ఎంతో ఆప్యాయముగా అడిగెను—"నేడు మీచదువు లేదాయేమి? మాస్టరుగారు పారిపోయినట్టున్నారు—మీపాఠశాలనియమములన్నియు తలక్రిందులుగా ఉన్నవే—శిష్యురాలు పుస్తకములతో తయారు, మాస్టరుగారి పలాయనము! పూర్వముమాదిరి అమల్ నీకు నియమానుసారము చదువుచెప్పుచున్నట్లు లేదే!"

చారు—"నాచదువు కొరకు అమలుని సమయము నష్ట పుచ్చుట న్యాయమా? అమల్ ఒకమామూలు * ప్రైవేట్ ట్యూటరనుకొనుచున్నావా?"

భూపతి చారునడుముచుట్టు చేయివేసి దగ్గరకు లాగుకొని, "ఇది సామాన్యమైన ప్రైవేట్ ట్యూషనా? చదువుచెప్పుటకు నీవంటి వదిన నాకు దొరికియుండిన—"

చారు భూపతి మాటపూర్తిచేయనీయక జవాబు చెప్పినది—"చాలించు చాలించు—భర్తవు కనుక సరిపోయి నది, లేనిచో నేమైయుండునో ఎరుగుదువా?"

చారు సంభాషణ భూపతికి కొంచెము బాధకల్గించినది. "అట్లైన నేను రేపటినుండి నీకు చదువుచెప్పెదను, నీపుస్తక ములు తీసికొనిరమ్ము, నీవేమి చదువుచున్నావో చూచెద" నని అతడనెను.

చారు "చాలు చాలు, నీవు చదువుచెప్పనక్కరలేదు— కాని నీపేపరు జమాఖర్చులలెక్క కొంచెము కట్టిపెట్టి ఇంకే విషయమునుగురించియైన మాట్లాడగలవో లేదో చెప్పు."

భూపతి—"ఆహా ఇప్పుడు నామనస్సు నీవెటుత్రిప్పితే అటే తిరుగును."

చారు—"అట్లైన, అమల్ వ్రాసిన ఈవ్యాసము చదివి చూడు—దీనిని చదివి నవగోపాల్ బాబు అమల్‌కు ఇండియా దేశపు †రస్‌కిన్ అనుపేరుపెట్టెనని సంపాదకుడు వ్రాసెనట."

---

* Private Tutor = ఇంటివద్ద చదువుచెప్పే మాష్టరుగారు.
†Ruskin.

విని భూపతి సంకోచించుచు ఆమెచేతిలోనుండి పత్రికను తీసికొనెను. పత్రిక విప్పిచూచెను. వ్యాసశీర్షిక "ఆషాఢ చంద్రుడు." ఇప్పటికి రెండువారములయినది భూపతి సర్కార్ †బజెట్‌తో బుర్ర బాదుకొనుచున్నాడు. ఆ అంకెలన్నియు బహుపదకీటకములమాదిరి అతని తలలో మూల మూలనుదూరి కెలకెల పెట్టుచుండుటచే 'ఆషాఢచంద్రు'ని ఆ మూలాగ్రముచదువు స్థితిలోలేడు. వ్యాసముకూడ చిన్నది కాదు.

వ్యాసము ఈవిధముగా ప్రారంభమైనది—ఆషాఢ చంద్రుడు నేడేల నీవిధముగ మేఘములవెనుక దాగియున్నాడు—స్వర్గలోకమునుండి ఏదైన దొంగిలించివచ్చి ఆకళంకమును దాచుకొన యత్నించుచున్నాడా ? ఏమూలను మేఘఛాయలేని చైత్రాకాశమున నిర్లజ్జగా తనను ప్రకాశింపచేసికొనుచుండెను—నేడా పకపకమను నవ్వేది, శిశుస్వప్నము వంటి, ప్రియురాలి స్మృతివంటి, సురేశ్వరి శచియొక్క అలక విలంబిత ముక్తమాలవంటి—"

అంతవరకుచదివి భూపతి తలగోకుకొనుచు ఇట్లనెను—"చక్కనిరచన, కాని దీనితో నాకేమిప్రయోజనము? నాకా కవిత్వము బోధపడునా!"

చారు ఆకాగితమతనిచేతిలోనుండితీసికొని సంకోచముతో, "అజ్ఞాన, నీకు బోధపడునది ఏమిటి?" అని అడిగినది.

†Budget - సర్కార్‌వారు శాసనసభలో నిర్ణయించబోవు జమా ఖర్చులు.

భూపతి—"నేను సామాన్యమానవుడను నాకు బోధ పడునది సంసారములోనుండు మనుష్యులు."

చారు—"సాహిత్యములో మనుష్యులసంగతి ఉండదు కాబోలు!"

భూపతి—"ఉండును కాని సాహిత్యములో నుండు నవి కల్పితములు, అదికాక సశరీరముగ మనుష్యులుండగా కల్పితరచనలలో వారిని వెదకుచు తిరుగు టేల?"

ఇలాగుననుచు భూపతి చారులతగడ్డమును ముద్దుగా పట్టుకొని, "ఇదిగో, ఇప్పు డేవిధముగా నిన్ను తెలుసుకొన గలుగుచున్నానో ఆలాగున తెలుసుకొనవలెనన్న 'మేఘనాద వధ' కావ్యము మొదటినుండి చివరవరకు చదువవలెనా"? అని యనెను.

కావ్యముల బోధపరచుకొను శక్తిలేదని భూపతి కొంత గర్వపడుచుండెను. అమలుని కవిత్వము బాగుగా చదువ లేదు, ఐనను అమలునియెడల లోలోపల కొంత భక్తి గౌరవములు అతనిలో కలిగినవి. చెప్పవలసినవిషయ మేమియు లేకున్నను అనర్గళముగ నన్నిమాటలు చెప్పుట తలపగులకొట్టు కొన్నను నాకు చేతకానిపని యని భూపతి అనుకొనెను. అమల్ కడుపులో నింతసామర్థ్యమున్నదని ఎవ రూహించ గలరు?

తనకు రసజ్ఞానములేదని భూపతి ఒప్పుకొనుచుండును. కాని సాహిత్యవిషయములలో నెట్టి కృపణతయు అతనిలో

కనపడునది కాదు. డబ్బులేని గ్రంథకర్త ఎవడైనవచ్చి భూపతిని పట్టుకొనినచో గ్రంథమచ్చొత్తించుభారము తానే వహించు చుండును. కాని గ్రంథముమాత్రము తనకంకితముచేయవద్దని కోరుచుండును. బంగాళీభాషలో చిన్న పెద్ద, ఎన్ని వారపత్రికలు, మాసపత్రికలు ఉన్నవో వానికి చందాదారుడుగానుండెను. విఖ్యాతములైనవిగాని అఖ్యాతములైనవిగాని, పాఠ్యములైనవి గాని అపాఠ్యములైనవిగాని, ప్రచురితమైన ప్రతిబంగాళీగ్రంథ మును భూపతి కొనుచుండెను. “చదువుటలేనేలేదు, దానికి తోడు కొనుటకూడ మానినచో, పాపముచేయుచుండుటకు తోడు ప్రాయశ్చితము వద్దనుట కాదా!” బంగాళీగ్రంథముల నతడు చదువువాడుకాడు కనుక పాడుగ్రంథములను ద్వేషించు వాడుకాడు. అతని బంగాళీలైబ్రరీ గ్రంథములతో నిండి యుండెను.

అమల్ ఇంగ్లీషుప్రూఫులుదిద్దుటలో సాయపడుచుండెను. వ్రాతప్రతిలోని కొన్నిమాటలు తెలియలేదు. భూపతిని అడిగి వానిని తెలిసికొనవచ్చునని కాగితములు కొన్నిపట్టుకొని అమల్ హఠాత్తుగా గదిలోనికి వచ్చెను.

భూపతి అతనినిచూచి నవ్వుచు ఇట్లనెను—“అమల్, ఆషాఢ చంద్రునిపైని, భాద్రపదమాసపు తాటిపండుపైని నీకిష్టమువచ్చినంత కవిత్వము వ్రాసుకో, నే నభ్యంతరపెట్టను— ఎవరిస్వాధీనతపైని నేను చేయివేయను. నాస్వాధీనతకు మీ రడ్డు

వ్వచ్చెదరేమి?—మీావదిన నాచేత నీకవిత్వము చదివించనిదే నన్ను విడువనంటున్నది—ఏమి యీా దౌర్జన్యము ?"

అమల్ నవ్వుచు జవాబుచెప్పెను—"మంచిదానవే వదినా!—నాకవిత్వము పట్టుకొని అన్నయ్యమీాద జులూమ్ చేయబోవుచున్నావని నే నూహించగలిగినచో నే నది వ్రాయు వాడను కాను."

అమల్ తనకవిత్వమును బహు ఆదరముతో చూచు కొనుచుండెను. దానిని సాహిత్యరసవిముఖుడైన భూపతికి చారు చూపించినదని అమల్‌కు కోపమువచ్చినది. చారది కనిపెట్టి దుఃఖించి సంభాషణను వేరొకవైపునకు త్రిప్పకోరి భూపతితో నిట్లన్నది—"మీాతమ్మునికి ఒకభార్యను కుదిర్చి పెండ్లిచేయకూడదా ? అట్లైన అతని కవిత్వోపద్రవము నీవు సహించియుండుట కవసరముండదు."

భూపతి—"ఇప్పటి కుర్రవాళ్లు నావలె తెలివిమాలిన వారు కారు. వారెంత గొప్పకవిత్వము చెప్పుచున్నను, ఆచరణలో పెట్టవలసివచ్చునప్పుడు అతిసులభముగా తప్పికొను చుందురు. నీ మరిదిగారిని పెళ్లికి ఒప్పించలేకపోతివే!"

చారు అక్కడనుండి వెళ్లిపోయినతరువాత భూపతి అమల్‌తో ననెను—

"నే నీపత్రికతో రాత్రింబగళ్లు కొట్టుకొనుచుండవలెను అమల్—చారుకేమియు తోచదు, పనిపాట్లులేవు, ఉండి యుండి

నేను వ్రాసుకొనుచుండు గదిలోనికి తొంగిచూచి వెళ్లిపోవుచుండును—ఏమిచేయవలెనో నాకు తోచకున్నది - నీవామెకు చదువుచెప్పు ఏర్పాటుచేసినయెడల చాల బాగుగనుండును అమల్. మధ్య మధ్య ఇంగ్లీషు కావ్యములలోనుండి తర్జుమా చేసి చెప్పినచో ఆమె ఆనందించును. దానివలన ఆమె కుపకారముకూడ కలుగ గలదు. సాహిత్యవిషయములలో మంచి రుచిగలది, చారు."

అమల్—"ఔను మంచిరుచిగలది. వదిన మరికొంచెము చదువుకొనినయెడల చక్కగా వ్రాయగలదనికూడ నానమ్మకము!"

భూపతి—"నాకు అంత ఆశ లేదు, కాని చారు బంగాలీ గ్రంథముల విషయమై నాకంటె తెలివిగా వాదించగలదు."

అమల్—"మంచి ఊహాశక్తి ఉన్నది ఆమెకు—స్త్రీలలో అంతశక్తి ఎక్కడోగాని ఉండదు."

భూపతి—"స్త్రీలేమిటి. పురుషులలోకూడ అరుదే—దానికి దృష్టాంతము నేనే. వదినకు సరియైన విద్యనేర్పినట్లైన నీకు మంచి బహుమానము ఇచ్చెదను, అమల్!"

"ఏమి ఇచ్చెదవు?"

"మీ వదిన కొక జోడీని వెదకితెచ్చి ఇచ్చెదను."

"తరువాత నామెకుకూడ చదువుచెప్పవలసియుండును—జీవితమంతా ఈవిధముగా స్త్రీలను తయారుచేయుచుండుటయే నా పని కాబోలు!"

ఈ అన్నదమ్ము లిద్దరు నేటికాలపువారు—ఎట్టిమాట లాడుటకును వారికి సంకోచము లేదు.

అమల్ పాఠకప్రపంచములో ఖ్యాతిసంపాదించి పెద్ద లేఖకుడై నాడు. ఇప్పటివరకు బడిపిల్లవానివలె ఉండెను. ఇప్పుడు సంఘములో నొక ముఖ్యుడుగా గణింపబడుచున్నాడు. సభలలో సాహిత్యవిషయములనుగురించి అప్పుడప్పుడు ఉపన్యాసముల నిచ్చుచున్నాడు. పత్రికాసంపాదకులు సంపాదకులదూతలు తరుచు అతని బసకు వచ్చుచున్నారు. అతనిని విందుల కాహ్వా నించుచున్నారు, తమతమ సమాజములలో అతనిని సభ్యునిగా చేరుమని, సభలకు అధ్యక్షునిగా రమ్మని విన్నపములు వచ్చు చున్నవి. ఇంటి దాసదాసీలకంట, బంధుమిత్రులకంట అతడు ఉన్నత పదవిని పొందెను.

ఇప్పటివరకు మందాకిని అతనినొక లెక్కింపదగినవానిగా చూచుచుండలేదు. చారు అమలుల హాస్యసంభాషణలను, వారి వాదనలను కుర్రవ్యవహారములని తలంచి వారిని నిరసనగా చూచి వారికి తాంబూలమిచ్చుట మొదలగు ఇంటిపనులు చేయుచుండెను. వారికంటె తానే యోగ్యురాలనియు, సంసార మునకు తానే వారికంటె ఆవశ్యకమనియు మందాకిని నమ్ము చుండెను.

అమల్ తమలపాకులబీడాలు అపరిమితముగ తిను వాడు. బీడాలుకట్టి సిద్ధముగనుంచుభారము మందాకినిది. వానిని ఎడతెరిపిలేక తినుచుండుటచూచి మంద చీకాకు పడు

చుండెను. చారు, అమల్—వీరిద్దరును కుట్రపన్ని మందాకిని కట్టియుంచిన బీడాలు లూటీచేయుచుండుట వారి ఆటలలో ముఖ్యమైనది. ఆ పోకేలా లిద్దరునుచేయు దొంగతనము మందాకినికి మాత్ర మామోదకరముగా నుండునది కాదు.

దాని నిజమైన కారణ మేమన, ఆశ్రితులలో ఒకనిని చూచి ఒకడు సహించలేడు. అమల్ ఉండుటచే మందాకిని చేయవలసిన ఇంటిపని కొంచెము పెరుగుచుండెను. ఆ పెరిగినది ఎంతస్వల్పమైనను మందాకినికి అది అవమానకరముఁగ తోచుచుండెను. చారు అమల్ యెడల పక్షపాతముకలది యని ఎరిగి మంద నోరువిప్పి ఏమియు ననలేకయుండెను. కాని అవకాశము చిక్కినచో ఎగతాళిచేయుటకు సదా సిద్ధముగానుండెను. రహస్యముగ ఇంటినౌకర్ల ఎదుట అమలుని నిందించుచు మాట్లాడుచుండును. నౌకర్లుకూడ ఆ మెతో కలియుచుందురు.

అమల్ క్రమక్రమముగ ఉన్నతిపొందుచుండుట చూచి మంద కాశ్చర్యము కల్గినది—పూర్వపు అమలుడు కా డిప్పుడు. మునుపటిసంకోచము ఇప్పుడతనిలో కానరాలేదు. మునుపటి నమ్రత లేదు. ఇతరుల నవమానపరచు అధికార మతని కిప్పుడు దొరకినది. లోకములో ప్రతిష్ఠపొంది, నిర్భయముగా తనను గురించి తాను ప్రచారణచేసికొనగల అధికారము సంపాదించగల సమర్థుడు తప్పక స్త్రీలదృష్టి నాకర్షించగలడు. అందరును అమలునియెడల భక్తికలిగియుండుట చూచి మందాకినికూడ అమలుని ఉచ్ఛశిరస్సువైపు తలయెత్తి చూచినది. అమలుని

కోమలముఖమున నవగౌరవదీప్తి చూచి మందాకిని మూర్ధార లైనది—అమలు డామెకంటికి క్రొత్తగా కనబడెను.

ఇప్పుడు తాంబూలము దొంగలించుట కవసరము లేక పోయినది. అమల్ ఖ్యాతిపొందుటవలన చారుకు నష్టము కలిగినది. బీడాలుచోరీకై వారు చేయుచుండు కుట్ర వారిరువురిలో ఒక స్నేహబంధము నేర్పరచియుండెను, ఇప్పు డా ముడి విడిపోయినది; బీడాలిప్పుడు తమంతటతామే అమల్ గదిలోనికి వచ్చుచుండెను.

వారిద్దరును నిర్మించుకొన్న సభలోనికి మందాకిని రాకుండునట్లు వారు పన్నుచుండు యుక్తులు బహు వినోదకరముగ నుండెను. ఆ వినోద మిక నుండదని చారుకు తోచినది మందను ఎడముగానుంచుట కిప్పుడు సాధ్యముకాదు. చారొకతెయే అమలుని మిత్రురాలనిగాని, ఆమె ఒకతెయే అతనిని బోధపరచుకొనగలదనిగాని ఇప్పుడు మందాకిని ఒప్పుకొనదు. ఇప్పటివరకు తాను కనపరచిన అశ్రద్ధను మందాకిని అసలు వడ్డీలతో చెల్లించ నిశ్చయించుకొన్నది. అమలుడును చారును ఒక్కచోట కనబడగానే మంద ఏదో నెపముపైని మధ్యకువచ్చి తనఛాయచే గ్రహణము కల్గించుచుండెను. మందాకినిలో కల్గిన ఈ మార్పునుగూర్చి చారు మందలేని సమయముచూచి, అమలునియొద్దకువచ్చి, పరిహాసముచేయకోరుచుండెను. కాని దానికైన వీలుదొరకునది కాదు.

పిలువనిదే మందాకిని ఇట్లు మాటిమాటికి వచ్చు చుండుటచూచి చారుకు కలిగినంత చీకాకు అమలునకు కలుగ లేదని చెప్పుట అనవసరము. విముఖముగానుండిన మందమనస్సు ఇప్పుడు తనవైపు తిరిగినదని కనిపెట్టి అమలుడు లోలోపల సంతోషించెను.

చారు, మందాకినిని దూరమునుండిచూచి కోపముతో, "అదిగో సరల వచ్చుచున్న"దని మెల్లగా అనుచుండును. అది విని అమల్ కూడ—"అదిగో చంపుకు తినుచున్నదే!" అని యనుచుండును. ప్రపంచములో ఇంకే యిద్దరుకలసియుండుట చూచినను ఇష్టపడకుండుట వీరిద్దరికిని అభ్యాసమైపోయినది. ఆ అభ్యాసమును అమల్ హఠాత్తుగ నిప్పుడెట్లు వదలుకొనగలడు! అటుపైన మందాకిని వారిసమీపమునకు వచ్చినతరువాత ఇష్టములేకున్నను మర్యాదకామెతో మాటలాడుచున్నట్లు నటించి, "ఏమి సమాచారము వదినా, నీ తాంబూలము డబ్బా మీాద నేడు బందిపోటు లక్షణములేవైన కనపడినవా?" అని అడుగుచుండును.

మందాకిని—"కోరినంతమాత్రన దొరకుచున్నప్పుడు దొంగతన మవసరమేమి?"

అమల్—"అడిగి సంపాదించుటకంటె దానివల్ల సుఖ మధికము."

మంద—"మీరు చదువుచుండినది ఆపివేసితిరేల— చదువండి, నాకు కూడ వినవలెనని యున్నది."

విద్యనభ్యసించుచున్నదను కీర్తిసంపాదించుటకు నే
వరకు మందాకిని ఎన్నడును ప్రయత్నించలేదు. అయిననే
"కాలోహి బలవత్తరః" కదా!

అరసికురాలైన మందాకినిఎదుట అమల్ తన కవి
మును చదువకూడదని చారు కోరిక. చదివి వినిపించవలెన
అమల్ కోరిక.

చారు—"అమల్ 'కమలకాంతుని కావ్యాలయము'
గురించి విమర్శవ్రాసి చదువుచున్నాడు—నీకది వినవలెన
యున్నదా?"

మంద—"నేను మూర్ఖురాలనే కాని కొంచెమై
బోధపరచుకోనలేనా?"

వెనుక నొకనాటిమాట అమల్‌కి జ్ఞప్తివచ్చినది. చా
మందతోకలసి ఒకనాడు గవ్వలాట ఆడుచుండెను. అమల్ త
కవిత్వము చేతపుచ్చుకొని ఆ ఆట సభలో ప్రవేశించి, తన పద
ములను వినిపింపవలెనని మిక్కిలి ఆత్రత పడెను, కాని వారా
ఆపకుండుటచూచి విసుగుకొనుచు అమల్, "మీ రాడ
కొనుచూ ఉండండి వదినా, నేను అఖిల్‌బాబుకు నా కవిత్వమ
వినిపించివచ్చెద"నని అన్నాడు.

చారు అమల్ కండువాకొన గట్టిగా పట్టుకొని, "ఛా
ఎక్కడికి వెళ్లెదవు కూర్చొను"మని యనుచు తొంద
తొందరగా తాను పీగి ఆట ముగించినది.

"మీ చదువు ప్రారంభమవును కాబోలు, నేనిక పోయెద"నని మందాకిని యన్నది.

"నీవుకూడ విను చెల్లీ," అని మర్యాదకన్నది చారు.

"మీ శుష్క సాహిత్యము నాకేమీ బోధపడదు తల్లీ—వినుటకు కూర్చున్నయెడల నాకు నిద్రవచ్చు" నని యనుచు, ఆటకు మధ్యను భంగముకలిగినదని చీకాకుపడి లేచి పోయినది.

ఆ మందాకినికే నేడు కమలాకాంతుని విషయమై విమర్శ వినవలెనని కుతూహలముకలిగినది—ఇదిచూచి అమల్, "మంచిమాట చిన్నవదినా, నీవు వినుట నా సౌభాగ్యమే," అని యనుచు పుటలు వెనుకకు తిరుగవేసి వ్యాసము మొదటినుండి చదువుట ప్రారంభించెను. వ్యాస ప్రారంభము రసవత్తరమైన భాగము—అది వదలి వినిపించుటకు అమల్‌కు ఇష్టము లేక పోయినది.

చారు అమల్‌ను చదువనీయక, "అమల్, జాహ్నవీ లైబ్రరీనుండి నాకు క్రొత్త మాసపత్రికలు తెచ్చియిచ్చెదనని అంటివే!" అని యన్నది.

అమల్—"నేడు కాదే!"

చారు "నేడే—మంచివాడవు! మరచిపోతివేమో!"

అమల్—"నేను మరువలేదు—నీవే—"

చారు—"సరే పోనీ—మీరు చదువుకొనుచుండండి, నేను పరేశుని పంపి తెప్పించుకొనెదను." ఇట్లనుచు చారు లేచిపోయినది.

ఆపద వచ్చిపడ్డదని అమల్ పోల్చుకొనెను. మంద అంతయు స్పష్టమైనది—చారుపై నామెకు ద్వేషము కలిగిన చారు వెళ్లిపోయినతరువాత అమల్ ఏమిచేయవలెనో నిశ్చ యించుకొనలేక తడబడుచుండుట చూచి కొంచెము నవ్వి ఆమె ఇట్లన్నది—"వెళ్లు బావా, అక్క అలకతీర్చు, ఆమె కోపము వచ్చినది—నాకు వినిపించుచు కూర్చున్న చి చిక్కులో పడవలసి వచ్చును."

అటుపైని లేచిపోవుట అమల్‌కు మిక్కిలి కష్టమైనది అతనికి చారుపై కోపమువచ్చి, "ఏమి, చిక్కెందుకు?" అ యనుచు వ్యాసమును చదువుట ప్రారంభించెను.

మంద రెండుచేతులతో ఆ వ్యాసమును మూ "అవసరములేదు బావా, చదువవద్దు," అన్నది.

అని కన్నీ రాపుకొనుచు బయటికి వెళ్లిపోయెను.

చారు మిత్రులయింటికి విందుకు వెళ్లినది. గదిలో కూర్చొని మంద జడత్రాడు పేనుచున్నది. 'వదినా' అ పిలచుచు అమల్ గదిలో ప్రవేశించెను. చారువిందుమాట అమల్ ఎరుగక పోలేదని మందాకినికి తెలుసును. "ఎవరి చూచుటకు వచ్చితివి, ఎవరు ప్రాప్తించిరి, అమల్‌బాబూ! నేడ నీ అదృష్టము బాగులేదు!" అని మంద అన్నది. "కుడిచే వైపుననున్న గడ్డి ఎంతో ఎడమవైపుననున్న గడ్డికూడ అంతే—గాడిదకు దీనియెడల ఎట్టి అనురాగమో దా

యెడలకూడ అట్టి అనురాగమే!” అని జవాబుచెప్పి అమల్ అచ్చటనే కూర్చుండి పోయెను.

అమల్—“మీ ఊరి కబుర్లు చెప్పు వదినా, విననలెనని ఉన్నది.”

రచన కుపయోగకరముగానుండునని అమల్ అందరి సంగతులు తెలిసికొనుటకు కుతూహల పడుచుండెను. కనుక పూర్వమువలె నుపేక్షించక మందతో నిప్పుడు తరచు సంభాషించుచు ఆమె పూర్వవృత్తాంతమునుగురించి ప్రశ్నించుచుండెను. ఆమె గ్రామమెక్కడో, అది యెట్టి స్థలమో, బాల్యకాల మెట్లు గడపినదో, వివాహ మెప్పుడు జరిగినదో—ఆ వివరములన్నియు అడుగుచుండెను. మందాకినియొక్క అతి సామాన్యజీవితవృత్తాంతము తెలిసికొనుటకు ఇంతకుపూర్వ మెవ్వరును ఇంత కుతూహలము కనపరచలేదు. మంద ఆ ప్రశ్నలకు సవిస్తరముగ జవాబు చెప్పుచుండెను—కాని మధ్యమధ్య తన మాటలకు తానే సిగ్గుపడి, “నేను ఇంత ప్రేల కూడ”దని అనుచుండెను.

“వినుటకు నాకు సరదాగానున్న”దని అమల్ ఆమెను హెచ్చరించుచుండెను. మందతండ్రిగారి గుమస్తా తన రెండో భార్యతో తరచు పోట్లాడి భోజనముచేయనని ఒట్టుపెట్టుకొని పనికి వచ్చుచుండెనట. ఆకలిబాధ సహించలేక తమ ఇంటికి భోజనమునకు వచ్చుచుండెనట. ఒకనాడీ విధముగా మందాకినిగారి ఇంట భోజనముచేయుచుండగా భార్యకంట పడి

పోయెనట—మంద ఆ కథ చెప్పుచుండెను, విని అమల్ పక పక నవ్వుచుండెను—ఆసమయములో చారు గదిలో ప్రవేశించినది.

చారు రాగానే కథనిలిచిపోయినది. అతి ఉత్సాహముతో జరుచున్న సభకు భంగముకలిగినదని చారుకు స్పష్టమైనది.

అమల్—"వదినా, త్వరగా తిరిగి వచ్చితివే!"

చారు—"అదియే పోల్చుకొంటిని—చాలా త్వరగా వచ్చినా"నని అనుచు తిరిగి బయటికి పోబోయినది.

అమల్—"మంచి పని చేసితివి, ఎంతకును రాకుంటివని విసుగుకొనుచుంటిని! నీకు వినిపించవలెనని మన్మథదత్తు క్రొత్తగా రచించిన 'సంధ్యా విహంగము' తీసుకొని వచ్చితిని."

చారు—"ఇప్పుడు వద్దు—నాకు పని యున్నది."

అమల్—"ఆజ్ఞ ఇమ్ము, నీపని నేను చేసెదను."

అమల్ పుస్తకము కొని చదివి వినిపించుటకు నేటి సాయంకాలము వచ్చునని చారు ఎరుగును. అమల్‌లో ఈర్ష్యపుట్టించుటకు దానిని పొగడవలెనని చారు నిశ్చయించుకొన్నది. అమల్ దానిని మరింత వికృతముగా చదివి ఎగతాళిచేయుచుండును—చారు దీని నూహించుకొని, విందుఇంట చేరియున్న వారందరు ఎంత బ్రతిమాలుచున్నను, ఒంట్లో బాగు లేదని వంకపెట్టి త్వరగా ఇంటికి వచ్చినది—అక్కడనే

యుండిన బాగుండును, వచ్చుట పొరపాటైనది, అని యను కొనుచు ఇప్పుడు విచారింపసాగినది.

మంద సిగ్గుమాలినతనమునకు మాత్రము మితియున్నదా! అమల్‌తో గదిలో ఒంటరిగా కూర్చొని పళ్లు ఇగిలించు కొని నవ్వుచున్నది. ఎవరైన చూచిన నేమందురు? కాని మందాకినిని తానిప్పుడెట్లు చీవాట్లు పెట్టగలదు? నీవు మాత్ర మట్లేల చేయుచుంటివి అని మంద ప్రశ్నింపవచ్చును! కాని మందసంగతి వేరు, తనసంగతి వేరు. తాను అమల్‌కు కవిత్వరచన కుత్సాహము నిచ్చుచుండును. అతనితో సాహిత్యచర్చ చేయు చుండును. మందకట్టి ఉద్దేశ మెన్నడును లేదు. అమాయకు డైన అమల్‌ను ముగ్ధుని చేసి వలలో వేసికొన ప్రయత్నించు చున్నది.—సందేహము లేదు. ఈ భయంకర విపత్తునుండి అమ లుని రక్షించుట తన కర్తవ్యమని చారు స్థిరపరచుకొన్నది. కాని ఆ మాయలాడి చేతులనుండి అతనిని తప్పించుట ఎట్లు— అతనికి బోధపరచి ఆ యాకర్షణనుండి దూరముచేయ యత్నిం చినయెడల లాభమునకుమారు నష్టము కలుగవచ్చుచు.

పాపము. తనభర్త వార్తాపత్రిక పనితో అన్నయ్య రాత్రింబగళ్లు చచ్చుచున్నాడు. ఇవతల మంద ఇంటిమూలను కూర్చొని అమలుని మాయపాశములోనికి లాగవలెనని చూచు చున్నది. అన్నయ్య ఎట్టి అనుమానమును లేక హాయిగా ఉన్నాడు. మందాకినిపైని అన్నయ్యకు అగాధ విశ్వాసము. కాని

అంతయు తనకళ్లతో సాక్షాత్తు చూచుచున్న చారు ఈ అన్యాయమునకోర్చి ఎట్లూరక యుండగలదు !

కాని అమల్ మొట్టమొదట బుద్ధిమంతుడే. కవియని పేరుపడిననాటినుండి అనర్థము ప్రారంభమైనది. అతని కవిత్వ మునకు కారణము చారే. ఏదోఒక అశుభముహూర్తమున అతనిని వ్రాయుటకు పురికొల్పినది. పూర్వమువలె అమల్‌పై నిప్పుడామె యధికారము సాగునా? పదిమందిచేయు ఆదరము యొక్క రుచి ఇప్పు డతనికి తెలిసినది—ఆదరించువారిలో నొకతె తగ్గినను అతనికి లక్ష్యముండదు.

అమల్ తనచేతులలోనుండి తప్పించుకొని పదిమందిచేతు లలో పడిపోయెనని చారుకు స్పష్టమైనది. ఇప్పుడు వచ్చిన ఆపద అదియే. చారు తనతో సమానురాలని అమల్ ఇప్పుడను కొనుటలేదు. అతడామెను దాటి చాలమీాదికి వెళ్లిపోయెను. అత డిప్పుడు లేఖకుడు, చారు పాఠకురాలు. దీనికి ప్రతీకార ముగ నేదైన చేయవలెను.

ఆహా ! అమల్ సరళుడు ! మంద మాయలమారి. అన్నయ్య అభాగ్యుడు !.

శ్రావణమాసము. ఆకాశము మేఘాక్రాంతమై యున్నది. గది చీకటిగా ఉండుటచేత చారు కిటికీతెరచి కూర్చొని ముందుకు వాలి ఏమో అతిశ్రద్ధగా వ్రాయుచున్నది.

అమల్ చప్పుడుచేయక వచ్చి వెనుకను నిలబడియుండుట చారెరుగదు. చక్కని మేఘపు వెలుతురిలో చారు వ్రాసుకొని

పోవుచుండెను. అమల్ వెనుకనుండి చదువుచుండెను. అమల్ రచించినవి రెండుమూడు వ్యాసములు ప్రక్కనుపడి ఉన్నవి. ఇవియే చారురచన కాదర్శములు.

"ఏనను రచన చేతకాదనుచున్నా!" హఠాత్తుగా అమలుని కంఠము వినబడగానే చారు ఉలికిపడి తొందరతొంద రగా తననోటుబుక్కును చేతులతో మూసి, "తప్పుకాదా!" అన్నది.

అమల్—"ఏమిటి నేనుచేసిన తప్పు ?"

చారు—"దొంగతనముగా చూచుచుంటి వేల ?"

అమల్—"మరియొకవిధముగా చూచుటకు వీలుచిక్క కున్నది కనుక."

చారు బుక్కును చింపబోయినది. అమల్ చప్పున దానిని చారుచేతిలోనుండి లాగుకొనెను. "నీవు దానిని చదివినయెడల శాశ్వతకాలము నీకు నాకు మాటలుండ" వన్నదిచారు.

అమల్— "చదువనీయనియెడల శాశ్వతకాలము నీకు నాకు మాటలుండవు."

చారు—"నీ పుణ్యముండును బావా మంచివాడవు— చదువకుము."

చివరకు అమల్ మాటే నెగ్గినది. తన కవిత్వమును అమల్‌కు చూపించవలెనని చారుప్రాణములు కొట్టుకొనిపోవు చుండెను; కాని చూపించువేళకు తనకు అంత సిగ్గువేయునని ఆమె అనుకొనలేదు. ఎంతో బ్రతిమాలి ఛారుచేత ఒప్పించి

చివరకు అమల్ దానిని చదువ నారంభించునప్పటికి భయముచే ఆమె కాళ్లు చేతులు చల్లపడిపోయినవి. తాంబూలము తీసికొని వచ్చెదనని నెపముపెట్టి ఆమె ప్రక్కగదిలోనికి వెళ్లిపోయినది.

అమల్ అది చదివి చారుదగ్గరకు వచ్చి, "బహుచక్కగా ఉన్నది వదినా!" అన్నాడు.

బీడాలో కాచువేయుట మరచి, "వేళాకోళముచేయ నక్కరలేదు. నాపుస్తకము నాకి"మ్మని చారుఅన్నది.

అమల్—"బుక్కు ఇప్పుడీయను, నీవు వ్రాసినది మంచి కాగితముమీద వ్రాసి పత్రికకు పంపెదను."

చారు—"ఆహా! పంపెదవు! సందేహమా?—నా పుస్తకము నాకిమ్ము."

చారు చాలా గొడవచేసినది. అమల్ కూడ పట్టినపట్టు వదలలేదు. అది ప్రచురణయోగ్యమైన దని అతడు చాలసార్లు నొక్కి నొక్కి చెప్పిన తరువాత తాళలేక చారు జవాబుచెప్పి నది—"నీతో నెగ్గుట అసాధ్యమైనపని; పట్టినపట్టు వదలవు."

అమల్—"అన్నయ్య కొకమారు చూపించవలెను."

ఆమాట విని సరుదుచున్న తములపాకుల నక్కడ వదిలి పెట్టి తొందరతొందరగా లేచి అమల్ చేతిలోనుండి నోటుబుక్కు లాగుకొనబోవుచు, "అతనికి ఎంతమాత్రము చూపించకూడదు. అతనికి నా కవిత్వమునుగురించి చెప్పినయెడల నేనిక ఒక పంక్తియైనను వ్రాయను," అని యన్నది.

అమల్—"నీవు గొప్పపొరపాటు పడుచున్నావు వదినా, అన్నయ్య బయటికి ఏమన్నను నీరచన చూచినయెడల మిక్కిలి ఆనందించును."

చారు–"నాఆనందము మాట ఆలోచించ నక్కరలేదా!"

తాను వ్రాసి అమల్‌కు ఆశ్చర్యము కలిగించవలెనని చారు ప్రతిజ్ఞ చేసికొన్నది. తనకు మందకు చాలభేదమున్నదని ప్రమాణము చూపించనిదే వదలనని నిశ్చయించుకొన్నది. కొన్నాళ్లు అనేకముగా వ్రాసి చించివేసినది. వ్రాసినది చాల వరకు అమల్ వ్రాతమాదిరినే యుండెను. దానిని దగ్గర పెట్టుకొని చూచునప్పటికి కొన్నికొన్నిచోట్ల పూర్తిగా అమల్ వ్రాసిన దానిలోనుండి ఎత్తివ్రాసినదే అని స్పష్టమైనది. అవియే బాగున్న భాగములు, మిగిలినవి కేవలము పటుత్వములేనివి. అది చూచిన యెడల అమల్ తప్పక నవ్వునని నమ్మి చారు ఆకాగితములను చిన్న చిన్న ముక్కలుగా చించి చెరువులో పారవేసి వచ్చినది. ఒక్క ముక్కయైన అతనిచేతిలో పడకూడదని ఆమె కోరిక.

మొట్టమొదట "శ్రావణమేఘము" అనువ్యాస మొకటి వ్రాసినది. అది ఒకభావాశ్రుజలభరితమైన క్రొత్తకవిత్వమని అనుకొన్నది. కాని అమల్ రచించిన 'ఆషాఢ చంద్రుడు' అను దానిని మార్చి వ్రాసినదానివలె కనబడుచున్నదని ఆమెకు హఠాత్తుగ తట్టినది. కాగితమున కొకవైపున వ్రాసినది, అతని కవిత్వము ఇది ఆ కాగితమునకే వెనుకప్రక్కను వ్రాసినది. అంతే వీని లోని భేదము. "చంద్రుడా, మిత్రమా, దొంగవలె మేఘముల

వెనుక పరుగెత్తుచున్నావేల?" అని అమల్ వ్రాసియుండెను; చారు వ్రాసినది—"సఖీ, కాదంబినీ, నీ నీలిచీరచెంగుక్రింద చంద్రుని దొంగతనముగ నుంచుకొని ఎక్కడికి పారిపోవు చున్నావు?—"

ఎంత ప్రయత్నించినను అమల్ భావములను తప్పించుకొని పోలేక చారు చివరకు రచనా విషయమే పూర్తిగా మార్చివేసినది. చంద్రుడు, మేఘము, చకోరము, సంపంగిపువ్వు వీని నన్నిటిని విడిచిపెట్టి "కాళీ మండపము" అను ఒక కవిత్వము వ్రాసినది. తమ గ్రామములో చెట్లనీడనున్న చెరువుగట్టుమీద కాళీమందిరమొకటి యుండెను. దానితో సంబంధించిన చిన్ననాటి భయము, ఔత్సుక్యము, జ్ఞాపకమున్న బాల్యకాలపు ఊహాలు, సదా మెలకువ కలిగియున్న ఆ కాళినిగురించి ఆ గ్రామస్థులకు గల వింతవింత నమ్మకములు—వీని యన్నిటితో ఒక కథనల్లినది. కథాప్రారంభము కావ్యాడంబరముతోనిండి అమలుని రచన మాదిరి యుండెను, కాని రానురాను గ్రామస్థుల భాషవలె సరళమయినది.

అమల్ చదివెను. మొదటిభాగము సరసముగనున్నదనియు కవిత్వ పటుత్వము చివరవరకు నిలువలేదనియు ఆతనికి తోచినది. ఎట్లైనను ప్రప్రథమమున ఇటువంటిది వ్రాయగలుగుట ప్రశంసనీయమని అతని యభిప్రాయము.

"మనము మాసపత్రిక ఒకటి ప్రచురించవలెనని నాకోరిక బావా, నీ అభిప్రాయమేమి ?" అని చారు అన్నది.

అమల్—"చాలా డబ్బులేనిదే సాగించలేము."

చారు—"ఆ పత్రికకు డబ్బవసరము లేదు. దానిని అచ్చొత్తించము, చేతితోనే వ్రాయుదము. దానిలో నీవు నేను వ్రాసినవి తప్ప మరి ఎవ్వారి రచనలు ఉండవు. ఇతరులు చదువుటకు కాదు, రెండు ప్రతులు మాత్రమే వ్రాయుదము, నీ కొరకొకటి నాకొరకొకటి."

కొన్నాళ్ల క్రిందట చారు ఇట్టి ప్రస్తావముచేసి యుండిన యెడల అమల్ సంతోషముతో గంతులువేసి యుండును. రహస్య రచనవలన అతనికి ఇప్పుడు తృప్తికలుగదు. తాను వ్రాయునది అందరు చదువవలెననియే అతనికోరిక. ఐనను తనలో మార్పు లేదనునట్లు నటించుచు ఉత్సాహముతో ఒప్పుకొనెను.

చారు—"కాని నీవు వ్రాయునది మన పత్రికకు తప్ప మరియే పత్రికలోను ప్రచురించనని మాట ఈయవలెను."

అమల్—"అట్లైన పత్రికా సంపాదకులు నాప్రాణములు తీసి వేయుదురు."

చారు—"నాచేతిలో చంపు అస్త్రములు లేవు కాబోలు!"

చివర కీవిధముగ స్థిరపరచబడినది: పత్రికాసంపాదకు లిద్దరు, లేఖకు లిద్దరు, పాఠకు లిద్దరు కలసి కమిటీగా ఏర్పడిరి.

''మన పత్రికకు 'చారుపాఠ' మను పేరు పెట్టెద" మని

అమల్ అన్నాడు, "వద్దు, 'అమలా' అనుపేరు మంచి"దని చారు అన్నది.

ఈ యేర్పాటు జరిగినప్పటినుండి ఈనడుమ తన మనస్సున నుండిన దుఃఖము చారు మరచినది. తమ మాసపత్రికలో మందాకిని దూరుటకు దారిలేదు; బయటివారు దూరు ద్వారముకూడ మూయబడినది.

ఒకనాడు భూపతి లోపలికివచ్చి, "చారూ, నీవు లేఖకు రాలవౌవుదువని ఎవ్వరును అనుకొనలేదే!" అని యనెను.

చారు ఉలికిపడి, ముఖమెర్ర చేసికొని, "నేను లేఖకు రాలనా! నే నెట్లు కాగలను, వట్టిమాట!" అని జబాబు చెప్పినది.

భూపతి—"చోరీమాల్‌తో పట్టుపడిపోతివి! దానికి రుజువు ఇదిగో!" అట్లనుచు కట్టెడు, 'సరోరుహా' మాస పత్రికలను చూపించెను. తాము ఇన్నాళ్లనుండి తమచే వ్రాత మాసపత్రికలో ప్రచురించి తమ గుప్తసంపత్తిగా ఉంచుకొనిన వ్యాసములన్నియు లేఖికాలేఖకులపేర్లతోకూడ సరోరుహాలో వెలువడినవి.

ఎవరో పంజరముయొక్క తలుపు విప్పి, తా నెంతో ముద్దుగా పెంచుచున్న పక్షిని విడిచిపెట్టినట్లు చారుకు బాధ కలిగినది. భూపతికి దొరకిపోతినను సిగ్గుమరచిపోయినది. విశ్వాసఘాతకుడైన అమల్‌పైని ఆమె కమితకోపము వచ్చినది.

"తరువాత, ఇది చూచితివా?" అని యనుచు భూపతి 'విశ్వబంధు' అను వార్తాపత్రికను చారు కళ్లయెదుట పట్టుకొనెను. దానిలో 'ఆధునిక లేఖకుల ధోరణి' అను వ్యాసమొకటి వెలువడినది.

"దానితో నాకేమి సంబంధ" మనుచు చారు దానిని చేతితో త్రోసివేసినది. అమల్‌పై కోపముకొలది మరిచేనిపైకి ఆమె మనస్సుపోలేదు. "ఒక్కమారు చదివిచూడు" మని తిరిగి భూపతి బలవంతపరచెను.

చదువక వీలులేకపోయి, చారు తొందర తొందరగా పుటలు తిరగవేసినది. అది భావాడంబరముతో నిండియున్న కొన్ని ఆధునిక రచనలను ఖండించుచు ఘాటుగా వ్రాసిన వ్యాసము. విమర్శకుడు దానిలో మన్మథదత్తు అమలుల రచనా పద్ధతిని తీవ్రముగా ఖండించి, వీనితో ఒక నూతన రచయిత్రియైన చారుబాల భాషయొక్క అకృత్రిమ సరళతను, సునాయాసముగ రసము నొలుకు ఆమె శక్తిని, ఆమె వర్ణనా నైపుణ్యమును పొగడెను. ఇట్టి రచ ననుకరణచేయుట వలన మాత్రమే అమల్‌కంపెనీవారికి ఐశ్వరము కలుగును, లేనిచో కంపెనీ తప్పక మునిగిపోవునని కూడా వ్యాసలేఖరి వ్రాసెను.

భూపతి నవ్వుచు, † "దీనికే గురువును చంపువిద్య అందు" రని అన్నాడు.

---

† బంగాళీ సామెత.

తన రచననుగురించి విమర్శకుని స్తోత్రము జ్ఞాపకమువచ్చినప్పుడెల్ల చారుకు ఆనందము కలుగుచుండెను. కాని ఆ ఉత్తరక్షణమే బాధకలుగుచుండెను—ఆనందము పొందవలెనను కోరిక ఆమె కున్నట్లులేదు. స్తోత్రసుధాపాత్ర పెదవులవరకు వచ్చినను ఆమె దానిని త్రోసివేయసాగినది.

అమల్ ఆమె రచనలు పత్రికలలో వేయించి హఠాత్తుగనామె కాశ్చర్యముకలిగింప సంకల్పించుకొనెనని చారుకు తోచినది. కాని అవి అచ్చుపడిన తరువాత ఆమె రచనను విమర్శించుచువ్రాసిన ప్రశంస ఏదైన వెలువడినయెడల, ఆ రెంటినికలిపి ఆమెకు చూపించి, ఆమెలో పుట్టుకోపమును శాంతపరచ అతడు నిశ్చయించి యుండవచ్చును. కాని ప్రశంసావ్యాసము వెలువడిన పిమ్మట ఆమెకు చూపించుటకు రాలేదేమో ? ఆ విమర్శ అమల్ మనసుకు బాధకలిగించుటచే, ఆమెకు చూపక దాచి యుండును. హాయిగా జీవించగోరి చారు ఒక చిన్న సాహిత్య కుటీరమును నిర్మించుకొన్నది. దానిపై ప్రశంస శిలావృష్టి కురిసినది. పెద్దశిల ఒకటి తగిలి కుటీరము కూలిపోయినది—చారు మనసుకు సుఖములేకపోయినది.

భూపతి వెళ్లిపోయిన తరువాత చారు పడకగది మంచముపైని నిశ్చలముగా కూర్చొనియుండెను—ఎదుట సరోరుహా సంచికలు, 'విశ్వబంధు' విప్పిపడియున్నవి.

పుస్తకము చేతపట్టుకొని చారు కాశ్చర్యము కలిగించగోరి అమల్ నిశ్శబ్దముగ వెనుకనుండి గదిలో ప్రవేశించెను.

విశ్వబంధులోని విమర్శ ఎదుట తెరచియున్నది, చారేదో ఆలోచించుచు కూర్చొనియున్నది. అమల్ అది చూచి చప్పుడుచేయక తిరిగి బయటికి వెళ్లిపోయెను. "విమర్శకుడు నన్ను తిట్టెనని చారు ఆనందములో మునిగి సర్వమును మరచిన,"దని అమల్ అనుకొనెను—ఆమెపై అతనికి ద్వేషము కలిగినది. ఒక మూర్ఖవిమర్శకుని స్తోత్రము చదివి చారు తన గురువుగారికంటె గొప్పదాననుకొనుచున్నదని అమల్ నిశ్చయించెను—చారుపై అమితకోపము వచ్చినది—చారాపత్రికను చిన్నచిన్న ముక్కలుగాచించి మంటలోవేసి బూడిద చేయవలసియుండెను.

చారుపై కోపగించి, అమల్ మందాకిని గది ద్వారము దగ్గరకు వచ్చి, బిగ్గరగా ఆమెను పిలిచెను.

మంద—"రా అన్నయ్యా, రా, పిలవకుండానే కనపడితివి నేడేమి భాగ్యము నాది!"

అమల్—"నేను క్రొత్తగా వ్రాసినవి ఒకటిరెండున్నవి వినెదవా?"

మంద—"ఎన్నాళ్లనుండియో వినిపించెదనని ఆశపెట్టుటయే కాని వినిపించుటలేదు. ఎందుకు అన్నయ్యా వద్దు, ఎవరికి ఎప్పుడు కోపమువచ్చునో తెలియదు—చివరకు నీవు చిక్కులో పడవలసి వచ్చును—నాకేమియు కాదు!"

అమల్ కొంచెము తీవ్రముగా జవాబుచెప్పెను—"కోపముచేయువారెవరు? ఎందుకా కోపముచేయుట? సరే, అది చూదము—నీకు వినవలెనని ఉన్నదా—ఆమాటచెప్పు!"

మంద వినుటకు శ్రద్ధతో కూర్చున్నది. అమల్ ఆడంబర ముగా రాగముతీయుచు చదువుట ప్రారంభించెను.

అమల్ వ్రాత మందాకినికి విదేశీవ్రాతవలె తోచు చుండెను. ఆమెకు దానిలో ఎక్కడను దరికానరాలేదు——కనుక మరీశ్రద్ధతో వినుచున్నట్టు నటించి కూర్చున్నది. రానురాను ఉత్సాహముకొలది అమల్ మరీ కంఠమెత్తి చదువుచుండెను.

వ్యాసములో అప్పుడు చదువుచున్న భాగము—— 'అభిమన్యుడు తల్లి గర్భములోనున్నప్పుడు వ్యూహములో ప్రవేశించుట మాత్రమే నేర్చుకొనెను, బయటికి వచ్చుట నేర్చుకొనలేదు. నదీస్రోతస్సు పర్వతముయొక్క పాషాణ జఠరములో నున్నప్పుడు ఎదుటకు ప్రవహించుట మాత్రమే నేర్చుకొనుచున్నది, వెనుకకు తిరుగుట నేర్చుకొనదు. ఆహా! ఓ నదీప్రవాహమా, ఓ యౌవనమా, ఓ కాలమా, ఓ సంసారమా—— మీరు ముందుకు మాత్రమే నడవగలరు. సువర్ణకాంతితో నిండియున్న పూర్వస్మృతులుండు తావులకు మీరు తిరిగి పోలేరే! అనంతజగత్తులో నుండునదేదియు వెనుకకు తిరిగి చూడలేదు, మానవుని మనస్సొక్కటే వెనుకకు తిరిగి చూడ గలదు——'

సరిగా ఆసమయములో మంద గదిద్వారము దగ్గర నీడ పడినది——మంద ఆనీడ చూచినది. కాని చూడనట్లు నటించి ఏకాగ్రచిత్తముతో అమల్ చదువుచున్నదానిని వినుచున్నట్లు రెప్పవేయక అతని ముఖము వైపు చూచుచుండెను.

నీడ తత్క్షణమే జరిగి పోయినది.

వచ్చినతోడనే అమల్ విశ్వబంధును చూచి దానిని ఘాటుగానిందుంచునని చారు ఊహించినది; అమల్ ప్రతిజ్ఞా భంగముచేసి తమ రచనలను పత్రికలకు పంపినందుకు తాను అమలునకు బాగా చీవాట్లు పెట్టవలెనని నిశ్చయించుకొని అమల్ రాకకెదురు చూచుచుండెను.

అమల్ వచ్చువేళదాటినది కాని నేడతడు రాలేదు. చారొకవ్యాసమువ్రాసి యుంచినది, అమల్ రాగానే చదివివిని పించవలెననుకొన్నది—అదికూడ అక్కడనే పడియున్నది.

అప్పుడెక్కడనుండియో అమలుని కంఠము వినబడినట్లు చారుకు తోచినది. ఆమాటలు మందాకిని గదిలోనుండి వచ్చు చున్నట్లు తట్టి శరవిద్ధమైనట్లు హఠాత్తుగ లేచి చప్పుడుచేయక ద్వారము దగ్గరకు వచ్చినిలిచినది. అమల్ మందాకినికి వినిపించు చుండిన వ్యాసము చారు వినియుండలేదు—"అనంత జగత్తులో ఏదియు తిరిగి చూడలేదు, మానవుని మనస్సొక్కటే వెనుకకు తిరిగి చూడగలదు"—అని అమల్ చదువుచుండెను.

చారు నిశ్శబ్దముగా వచ్చినరీతిని తిరిగి వెళ్లిపోలేక పోయినది. నేడు రెండుమూడు దెబ్బలు ఒక దానిపైనొకటి తగులుటచే ఆమె ఓర్మిపోయినది. మందాకినికి ఒక్క అక్షర మైనను బోధపడియుండదనియు, అమల్ మూర్ఖునివలె ఆమెకు వినిపించి తృప్తిపొందు చున్నాడనియు కేకవేసి చెప్ప

వలెనని చారుకు కోరికగల్గినది. కాని దానిని మాటలతో చెప్పక కోపముతో నడుచుచు పాదశబ్దముల ద్వారా ప్రచారణ చేసివచ్చి, పడకగది తలుపులు పెద్ద ధ్వనిచేయుచు మూసినది.

అమల్ కొంచెము సేపు చదువుట నిలిపెను. చారు వైపు సంజ్ఞ చేయుచు మంద నవ్వినది. అమల్ తనలో తానిట్లను కొనెను. "వదిన ఇంత దుర్మార్గురాలేమి? నేనామె బానిసనా, నన్నామె డబ్బిచ్చి కొని తెచ్చుకొన్నదా? నా కవిత్వము ఆమెకు తప్ప ఇంకెవరికిని వినిపించకూడదా? ఘోరాన్యాయమే!" ఇట్లను కొని మరికొంచెము బిగ్గరగా మందాకినికి వినిపించుట మొదలు పెట్టెను.

చదువుట ముగించి అమల్ చారుగదియెదుటనుండి బయటికి వెళ్లెను. పోవునప్పుడు చారుగదివైపు చూచెను. గదితలుపులు మూసి యుండెను.

అడుగుల చప్పుడునుపట్టి అమల్ తనగది ఎదుటగా వెళ్లి పోవుచున్నాడని చారు పోల్చుకొన్నది. ఆమెగది దగ్గర నిలువనైనలేదే! దుఃఖమువలనను కోపమువలనను ఆమె కేడ్వు రాలేదు. రచనలు వ్రాసియుంచిన నోటుబుక్కు తీసి ఆపుటలను ఒక్కొక్కటిగ చించి, ముక్కలు ముక్కలుచేసి కుప్పపెట్టినది. పాపము! ఏ అశుభక్షణమున చారా కవిత్వము ప్రారంభినదో కదా!

సంధ్యవేళను వరండామీదనుండి జాజిపువ్వులవాసన వచ్చుచుండెను. అక్కడక్కడ చెదిరియున్న మేఘము

లలోనుండి నక్షత్రములు రమణీయముగ కనపడుచుండెను. చారు నేడు తలదువ్వుకొనలేదు,బట్టమార్చుకొనలేదు, చీకటిలో కిటికీపై కూర్చొనియుండెను. మృదువుగ వీచుచున్న గాలికి ఆమె జుట్టెగురుచుండెను. ఆమె కళ్లవెంబడి నీళ్లెందు కట్లుకారుచున్నవో ఆమెకే తెలియలేదు.

అట్టి సమయమున భూపతి గదిలోనికి వచ్చెను. అతని ముఖము వాడియుండెను. హృదయము భారాక్రాంతము—ప్రతిదినము అత నంతఃపురములోనికి వచ్చుసమయము కాదది. పత్రికను వ్రాసి, పూఫులుదిద్ది లోనికివచ్చునప్పటికి ఆలస్యమగుచుండును. నేడేలనో మనశ్శాంతిని కోరుచు చారువద్దకు సంధ్యకాగానే వచ్చినట్లున్నది.

గదిలో దీపములేదు. భూపతికి చీకటి మసకలో చారు అస్పష్టముగా కిటికీలో కనబడినది. అడుగులచప్పుడు వినబడికూడ చారు ముఖము త్రిప్పలేదు; బొమ్మవలె నిశ్చలముగ కూర్చొని యుండెను.

భూపతి కొంచె మాశ్చర్యపడి—"చారూ!" అని పిలచెను.

భూపతికంఠము విని చారు ఉలికిపడి లేచినది. వచ్చినవారు భూపతియని చారనుకొనలేదు. భూపతి మిగుల ఆదరముతో చారుజుట్టులో వ్రేళ్లనుపెట్టి తలనుమురుచు, ప్రేమార్ద్రకంఠముతో, "చీకటిలో ఒక్కతెవే కూర్చొనియున్నావేమి, చారూ, మంద ఎక్కడికి వెళ్లినది?" అని యడిగెను.

చారనుకొన్నట్లు నేడేమియు జరుగలేదు. అమల్ తప్పకవచ్చి క్షమాపణ కోరుకొనునని ఆమె స్థిరపరచుకొని, అతనికొరకై ఎదురుచూచుచు కూర్చొనియుండెను. అట్టి సమయమున భూపతి రావచ్చునని ఆమె అనుకొనలేదు. హఠాత్తుగ నతని కంఠము వినినతోడనే ఆమె దుఃఖ మాపు కొనలేక ఏడ్వసాగినది.

భూపతి మనస్సుకు బాధకలిగినది. "ఏమిజరిగినది చారూ?" అని కలవరపడుచు భూపతి అడిగెను.

ఏమిజరిగినదో చెప్పుట కష్టము. విశేష మేమియు లేదే! అమల్ తాను క్రొత్తగా వ్రాసినదానిని తనకు మొదట విని పించక మందకు వినిపించెను. ఈవిషయమై భూపతితో ఏమని ఫిర్యాదుచేయగలదు? విని భూపతి నవ్వడా? ఈ స్వల్పవిషయ ములో గొప్ప అపరాధమును కనిపెట్టుట చారు కసాధ్యమైనది. అకారణముగ తనకంత బాధ ఏల కలుగుచుండెనో తెలియక పోవుటచే ఆమెవేదన మరింత అధికమైనది.

భూపతి—"ఏమయినది చెప్పు చారూ, నేనేమైన తప్పు చేసితినా? పత్రికపనితో సదా నేనెట్లు కలతచెందుచున్నానో నీవెరుగుదువు. నీకేమైన బాధ కలిగించియున్నచో అది నేనిచ్ఛా పూర్వకముగా చేసినది కాదు."

భూపతి అడిగిన ప్రశ్నకు తానెట్టి జవాబును ఈయ జాలదు. కనుక ఆమె లోలోపల మరింత కలతచెందుచు, అత డామె నెట్టైన వదలిన బతుకుదునని అనుకొనెను.

చారు జబాబుచెప్పకపోవుటచే భూపతి ఎంతో ఆదరముతో మరలననెను—"తరచు నీదగ్గరకు రాలేకున్నాను చారూ, అది నాఅపరాధమే, కాని అట్లికముందెన్నడును జరుగదు. రాత్రింబగళ్లిక పత్రికతోనే కూర్చుండను. నీకిష్టము వచ్చినంతసేపు నీతోనే కాలముగడుపుచుందును."

"అబ్బే అది కాదు," అని చారు లోలోపున చీకాకుపడి జబాబుచెప్పినది.

"అట్లైన మరిఏమి?" అని అడుగుచు భూపతి మంచముపై కూర్చుండెను.

చారు చీకాకు అణచియుంచుకొనలేక, "ఇప్పుడుకాదు రాత్రి చెప్పెద," నన్నది.

భూపతి కొంచెము నేమేమియు ననక, "సరే, ఇప్పుడు చెప్పనక్కరలేదు," అనుచు లేచి బయటికి వెళ్లిపోయెను. తానేది చెప్పగోరి వచ్చియుండెనో అది చెప్పుట జరగలేదు.

భూపతి మనస్సుకు బాధకలిగినదని చారుకు స్పష్టమయి, తిరిగి అతనిని పిలువవలెననుకొన్నది. కాని పిలిచి అతనితో నేమి మాటలాడగలదు? అనుతాపముకలిగి చాల బాధ పొందినది. కాని ఏమిచేయుటకు తోచలేదు.

రాత్రియైనది. భూపతిభోజనమునకై బహుచక్కని ఏర్పాటుచేసి చేతవిసనకర్రపట్టుకొని తాను ప్రక్కనే కూర్చున్నది.

ఆసమయమున, "వ్రజా! వ్రజా!" అని కేకలువేయుచున్న మందాకిని కంఠము వినబడినది. నౌకరు, వ్రజ, పలికినతరువాత అమల్‌బాబు భోజనమైనదా యని ఆమె వ్రజను అడిగినది. అయినదని వాడుచెప్పగా, "భోజనమైనప్పటికిని నీవు తాంబూలముతీసుకొని వెళ్లలేదేందుకు?" అని యనుచు ఘాటైన తిట్లు ప్రయోగించి మంద వానిపై నెగిరిపడినది.

నేడు భూపతితో అత్యుల్లాసముగ నెమ్మదిగ నెన్నో మాటలు చెప్పవలెనని చారు తనలో తాను ప్రతిజ్ఞచేసికొన్నది. ఏమేమి మాటలాడవలెనో అవికూడ ముందుగానే నిర్ణయించుకొని కూర్చున్నది. కాని మందాకిని కంఠము వినబడినతోడనే ప్రయత్నమంతయు వృథాయైనది. భోజనసమయములో భూపతితో ఒక్కమాటయైన నాడలేకపోయినది. భూపతికూడ ఎట్టియుత్సాహాములేక పరధ్యానముగనుండెను. అతడు భోజనము మనసారచేయలేదు. మధ్యనొక్కమారుమాత్రము చారు భోజనమేమియు చేయుచుండలేదేమియని అడిగినది.

"అట్లడుగుచున్నావేమి? తినుట తగ్గించలేదే!" అని భూపతి జవాబు చెప్పెను.

పడకగదిలోనికి పోయినపిమ్మట, "నాతో నేదో ఇప్పుడు చెప్పెదనంటివి?" అని భూపతి అనెను.

చారు—"కొన్నాళ్లనుండి చూచుచున్నాను. మంద వ్యవహారమేమియు బాగులేదు. ఆమె నిక ఇక్కడ నుంచుటకు నాకు సాహసము చాలదు."

భూపతి—"ఏమి? ఏమిచేసినది.?"

చారు—"అమల్‌తో ఆమెనడవడి చూచినయెడల నాకు సిగ్గువేయుచున్నది."

భూపతి నవ్వుచు జబాబు చెప్పెను—"నీకు పిచ్చెత్తినది! అమల్ కుఱ్ఱవాడు, నిన్న లేదు మొన్నటివాడు!"

చారు—"ఇంట్లోని సంగతులేమియు నీకు తెలియదు, బయటివార్తలు కూడ పెట్టుకొని తిరుగుచుందువు. పాపము, మా అన్నయ్యమాట ఆలోచించుచున్నాను. అన్నయ్య భోజనము చేసెనో చేయలేదో ఆసంగతికూడ ఆమెకక్కర లేదు; కాని అమల్ బాబు తమలపాకులలో చున్నము తక్కువైనయెడల నౌకర్లమీద మండిపడి గొడవచేయుచుండును."

భూపతి—"స్త్రీలు - మీరు - బహు సందిగ్ధస్వభావములు కలవారు, ఆమాట మరవకూడదు."

"ఔను, మావి సందిగ్ధస్వభావములే. కాని ఇంట్లో ఇటువంటి సిగ్గుమాలినపనులు జరుగుచుండుటచూచి నేనూరుకొనలేను," అని చారు కోపముతో జబాబు చెప్పినది.

ఈవిధముగ చారు కారణములేకయే అనుమానించుచుండుటచూచి భూపతి తనలో తాను నవ్వుకొనెను. అతనికి కొంచెము సంతోషముకూడ కలిగినది. గృహము పవిత్రముగ నుండునట్లును, ఊహలోనైన కళంకస్పర్శ తగలకుండునట్లును సాధ్వీమణులగు భార్యలు సదా జాగరూకత కల్గియుందురు.

వారి అనుమానపు చూపులలో ఒకవిధమగు మాధుర్య మున్నది, మహాత్త్వమున్నది.

భూపతి భక్తితోను ప్రేమతోను, చారు నొసటను ముద్దు పెట్టికొని ఇట్లనెను—"దీనివిషయమై మరి గొడవ చేయనక్కఱ లేదు. ఉమాపదుడు మైమన్‌సింగ్ వెళ్లి అక్కడ ప్రాక్టిస్ పెట్టుకొనబోవుచున్నాడు. మందకూడ అతనితో పోవుచున్నది." చివరకు తనమనసులోనికలత, అప్రీతికరమగువాదనలు మరవ కోరి టేబిల్‌లోనుండి పుస్తకమును బయటికి తీసి పట్టుకొని, నీ వ్యాసము నాకు వినిపించుము చారూ," అని యనెను.

చారు అతనిచేతిలోనుండి పుస్తకము లాగుకొని, "నీకది బాగుండదు, విని వెటకారము చేయుదువు," అని యనెను.

చారుమాట భూపతికి కొంచెము బాధించినది, కాని బయట కది తెలియనీయక ఇట్లు జబాబు చెప్పెను—"లేదు, నేను వేళకోళము చేయను, కదలక మెదలక నోరుతెరవక కూర్చొనియుండెదను; చూచి నేను నిద్రపోవుచున్నానని నీ వనుమానింతువు—అంత నిశ్చలముగ కూర్చుండెదను."

భూపతి కోరిక సఫలము కాలేదు. రచన ఇంటివెంటలో మాయమైనది.

భూపతి చారుతో అన్నిసంగతులు చెప్పజాలకుండెను. భూపతివార్తాపత్రికకు ఉమాపదుడు మేనేజరు. చందాలు వసూలుచేయుట, అచ్చాఫీసు బాకీలు తీర్చుట, గుమాస్తాలకు

నౌకర్లకు జీతము లిచ్చుట—మొదలగువానిభారమంతయు ఉమాపదమీాదనే యుండెను.

ఒకనాడు కాగితము సప్లై చేయుచుండిన వర్తకుని దగ్గర నుండి హఠాత్తుగవచ్చిన ఉత్తరము చూచి భూపతి మిక్కిలి ఆశ్చర్యపడెను. దుకాణదారుడు తనకురావలసిన 2700-రూపాయలు తత్క్షణము చెల్లించుమని వకీల్ చేత నోటీసు ఇప్పించెను. భూపతి ఉమాపతిని పిలిపించి, "ఇది ఏమి, కాగితములవాని బాకీరూపాయలు నీచేతికి నేనే స్వయముగా ఇచ్చి యుంటిని, వానికి మనమీాయవలసినది ఐదారువందల కధికముండదే!" అని యనెను.

"దుకాణదారుడు తప్పక పొరపాటు పడుచున్నా"డని ఉమాపదుడనెను. కాని రహస్యము దాగియుండలేదు. కొంత కాలమునుండి ఉమాపదు డీవిధముగానే మోసపుచ్చుచుండెను, కాగితముల వర్తకునివద్దనేకాక బజారులో అనేకులదగ్గర భూపతి పేరను అప్పులు చేసెను. ఉమాపదుడు స్వగ్రామములో పక్కాభవంతి యొకటి కట్టించుచుండెను; దాని కవసరమైన సామగ్రి భూపతిపేరనేకొని, కాగితముకొరకు భూపతియిచ్చిన రూపాయలతో ఆబాకీలు దిద్దెను.

దొంగతనము పూర్తిగా బయలుపడిపోయినతరువాత ఉమాపదుడు, పౌరుషముతో ఇట్లనెను. "నేనెక్కడికి పారి పోను, పనిచేసి కొంచెముకొంచెముగా నీ అప్పుతీర్చెదను, అణాపైసలతో చెల్లించనియెడల నాపేరు ఉమాపద కాదు."

ఉమాపదుడు పేరు మార్చుకొనుటవలన భూపతికి మన శ్శాంతి కలుగదే! డబ్బుపోయినదని భూపతికి అంతగా బాధించ లేదు, కాని ఈ విశ్వాసఘాతకత తెలియగానే భూతలమువదలి శూన్యములో అడుగుపెట్టినట్లు అతనిలో దిగులుపుట్టినది.

ఆనాడు పెందలకడ అంతఃపురములోనికి అతడు వచ్చు టకు కారణ మిదియే. పృథ్విపై విశ్వశింపగల తావొకటి ఉన్న దనినమ్మి, లోనికివచ్చి ఒక్కనిమిషముపాటు మనశ్శాంతి ననుభ వింపవలెనని అతనిహృదయ మాకులపడినది. కాని చారు సంధ్యాదీపము నార్పి, దుఃఖముతో కిటికీదగ్గర కూర్చుండి యుండెను.

ఉమాపదుడు మర్నాటియుదయముననే మైమన్‌సింగ్ పోవలెనని నిశ్చయించుకొనెను. అప్పులవారికి అతని చర్య తెలి యకముందే ఊరువిడిచిపోవలెనని అతని ఉద్దేశము. భూపతికి అసహ్యముకలిగి ఉమాపదతో మాట్లాడుట మానెను. భూపతి తనతో మాటలుమానుట ఉమాపదునకు హాయి యనితోచినది.

అమల్ మందాకినిగదిలోనికి వచ్చి, "సామా నేల సర్దు చున్నావ"ని యడిగెను.

మంద——"ఎప్పుడో వెళ్లవలసినదే కదా! చిరకాల మిక్కడ నుండగలమా?"

అమల్——"ఎక్కడికి వెళ్లుచున్నారు?"

మంద——"మాయూరికి."

అమల్—"ఎందుకు? ఇక్కడ నుండు ఇబ్బందేమి?"

మంద—"నాకేమి ఇబ్బంది, మీనలుగురితో హాయిగా ఉంటిని, కాని ఇతరుల కిబ్బంది కలిగినది." ఇట్లనుచు మంద చారు గదివైపు కళ్లుతిప్పినది.

అమల్ జవాబు చెప్పలేదు. "ఛీ ఛీ, సిగ్గు సిగ్గు, భూపతి బాబు ఏమనుకొనుచున్నారో!" అని మంద అన్నది.

అమల్ దీనినిగురించి మరి వాదించలేదు, చారు తమవిషయమై చెప్పరాని సంగతులేవో చెప్పియుండవచ్చునని అతను పోల్చుకొనెను.

అమల్ ఇంటిలోనుండి బయటికి వచ్చి రోడ్డుపై పచారి చేయుచుండెను. అతనికి ఆ ఇంట్లోనికి తిరిగి వెళ్ల కూడదని బుద్ధి పుట్టినది. అన్నయ్య వదినమాటనమ్మి తానపరాధియని నమ్మినప్పుడు మందాకినివలె తానుకూడపోవుట న్యాయమని అమల్‌కు తోచినది. మందాకినిని తరిమివేయుట తననుకూడ పొమ్మనుటయే—నోటిమాటలతో చెప్పలేదు—అంతేభేదము. అమలునకిప్పుడు తన కర్తవ్యము స్పష్టమైనది. ఇక నొక్కక్షణమైన ఇక్కడ నుండకూడదు. కాని అన్నయ్యకు తన విషయమై ఎట్టి చెడ్డఅభిప్రాయము నుండకూడదనిమాత్ర మతడు కోరుచుండెను. అన్నయ్య ఇన్నాళ్లు తనను పూర్తిగానమ్మి నిండు స్వేచ్ఛనిచ్చి తన యింటిలో నుంచుకొనెను. అన్నయ్య విశ్వా

సము తగ్గింపగల దేమియు తాను చేయలేదని అతనితో చెప్ప కుండగ తానెట్లు పోగలడు?

భూపతి తలను చేతిపై నానుకొని బావమరదియొక్క కృతఘ్నత, అప్పులవారి తొందర, జమాఖర్చుల తప్పులు, నగదు లేకపోవుట — మొదలగువానిని గురించి ఆలోచించుచుండెను. ఈదుఃఖము భరించుటలో తనకుతోడుగానుండు వారెవ్వరును లేరు—మనోవేదనతో ఒంటరిగా యుద్ధముచేయుటకు సిద్ధపడుచుండెను.

అటువంటి సమయములో అమల్ తుపానువలె గదిలో ప్రవేశించెను. గాఢచింతలో మునిగియున్న భూపతి ఉలికి పడి తలయెత్తిచూచి, "ఏమిసమాచారము అమల్?" అని యడి గెను—అమల్ నదో మరియొక క్రొత్త విపత్తునుగురించి చెప్పు టకు వచ్చెనని భూపతికి హఠాత్తుగ తట్టినది.

"నాపై సందేహముకలుగుటకు నీకేదైన కారణము కన బడినదా అన్నయ్యా?" అని అమల్ అడిగెను.

"నీపై నా సందేహమా!" అని భూపతి ఆశ్చర్యపడుచు ననెను—అని ప్రపంచమున జరుగుచున్నదానిని పట్టి చూచిన యెడల అమల్ ని కూడ నేనాడో సందేహింతునేమో యని తనలో తాననుకొనెను.

అమల్—"వదిన నా నడవడినిగురించి నీతో ఏమైన అన్నదా?"

భూపతి, "ఇదా సమాచారము! బ్రతికించితివి!" అని తనలో తానను కొనెను. ఒక ఉపద్రవముపై దానికి మించినది ఇంకొకటి వచ్చిపడ్డదని భూపతి జడిసెను. ఘోరాపదసమయములోనున్నప్పుడుకూడ తుచ్ఛపు ఫిర్యాదులు వినకతప్పదని జ్ఞాపకము తెచ్చుకొనెను. ఒకప్రక్కనుండి వంతెనను విరగ కొట్టుచు, వంతెనదాటి అవతలికి మూటముల్లె పట్టుకొని పొమ్మను చుండుటసంసారము మనపై విధించు కర్తవ్యము.

మరియొక నాడిట్టిది జరిగియున్నయెడల భూపతి పరిహాసము చేసియుండును, కాని నేడతనిలో దానికితగిన ప్రఫుల్లత లేక, "అమల్ నీవు పిచ్చివానివలె నున్నా" వని మాత్ర మన్నాడు.

"వదిన నీతో ఏమియు ననలేదా?" అని అమల్ మరల నడిగెను.

భూపతి—"నీమీదనుండు అనురాగముకొలది ఏమైన చెప్పియుండినయెడల అది కోపమునకు కారణముకాకూడదు."

అమల్—"ఉద్యోగమేదైన చూచుకొనుటకు నేనిక బయటికి పోవలెను."

"కుర్రతరహా మాను అమల్! ముందు బాగా చదువు కొనుము, ఉద్యోగముమాట తరువాత ఆలోచించవచ్చును," అని గదుముచు భూపతి కోపముతో జవాబు చెప్పెను.

అమల్ ముఖమువాల్చుకొని బయటికి వచ్చెను. భూపతి చందాదారులపట్టీ తీసి మూడుసంవత్సరములనుండి వారి జమా ఖర్చులు సరిచేసి చూచుచు కూర్చుండెను.

ఎదుటనిలబడి వదినను ప్రశ్నించవలెననియు దీని విషయమై తుదవరకు చూడనిదే విడిచిపెట్టకూడదనియు అమల్ నిశ్చయించుకొనెను. వదిననడుగవలసిన కఠినప్రశ్నలను తనలో తాను వర్ణించుకొనుచుండెను.

మందాకిని వెళ్లిపోగానే అమల్‌ను తానేపిలిపించి ఒక వ్యాసము వినిపించి అతని మనస్సును శాంతిపరుపవలెనని చారు ఉద్దేశించినది. అమలుని వ్యాసము ననుకరించి "అమావాస్య నాటి కాంతి" అను ఒక వ్యాసము తయారుచేసినది. పూర్తిగా తనసొంత రచనయైనయెడల అమల్ ఇష్టపడడని చారు ఎరుగును.

పూర్ణిమ తన కాంతిని పూర్తిగా బయటపెట్టి వేయుచుండునని చారు తన క్రొత్తరచనలో పూర్ణిమనునిందచేసి సిగ్గు తెప్పించినది. అమావాస్యయొక్క అగాధాంధకారములో పదునారు కళలుగల చంద్రునికాంతి పొరలు పొరలుగ సంపూర్ణముగ కప్పబడియుండుననియు, కనుక పూర్ణిమనాటి కాంతికంటె అమావాస్యనాటి చీకటి అధికపరిపూర్ణతగలది అనియు చారు వ్రాసుకొనిపోయినది. అమల్ తన కవిత్వమును అందరి ఎదుట చాటుచుండును. చారు ఎవరియెదుటను తనరచనను చదువదు.___

పూర్ణిమ అమావాస్యలను సరిపోల్చి చెప్పుటలో చారు అమ లుల మాట సూచించబడినదేమో!

ఋణబాధను తప్పించుకొనగోరి భూపతి తనపరమ మిత్రుడగు మతిలాల్ వద్దకు వెళ్లెను.

మతిలాల్ కష్టములలో నున్నప్పుడు భూపతి అతనికి కొన్నివేలు బదులిచ్చియుండెను. ఇప్పుడు గొప్పచిక్కులలో ఉండుటచేత భూపతి మతిలాల్ వద్దకు ఆరూపాయలకొరకు వచ్చెను. మతిలాల్ స్నానముముగించి ఒంటిపై బట్టతీసి విసనకర్రతో విసురుకొనుచుండెను, ఎదుట బల్లపై పుస్తకమునుంచి చిన్నచిన్న అక్షరములతో రామకోటి వ్రాయుచుండెను. భూపతి కనబడినతోడనే అత్యాదరముతో, "రా భూపతి, ఇప్పుడు నీదర్శనము దొరకనే దొరకుచుండుటలేదు," అని యనెను.

రూపాయలమాట విని మతిలాల్ ఏమియు తెలియనట్లు క్రిందికి మీదికి చూచుచుండెను. భూపతి సాలు,మాసము తారీకు జ్ఞాపకము లేగా, "ఓ అదియా, అది చాలాకాలము క్రితమే కాలదోషము పుట్టినదే!" అని యనెను.

ఆ జబాబు వినగానే భూపతికి ప్రపంచము హఠాత్తుగ తలక్రిందులైపోయినట్లు తోచినది. ముఖముపైనుండు ముసుగు జారిపడిపోయినది. కుటిలత కంటపడగానే భూపతికి భయము కల్గి శరీరము కంటకితమైనది. హఠాత్తుగ వరదవచ్చిపడునప్పుడు మనుష్యులుభయపడి అంతటిలో ఎత్తైన సాలవైపునకు పరు

గెత్తునట్లు, భూపతి మోసముతో నిండియున్న బయటి సంసారమునుండి అంతఃపురములోనికి పరుగెత్తివచ్చెను; 'ఏదెట్లైనను చారుమాత్రము నన్ను మోసపుచ్చదు కదా!' అని తనలో తాననుకొనెను.

చారప్పుడు మంచముమీద కూర్చొని, ఒడిలో తలగడ నుంచుకొని, దానిపై పుస్తకమునుంచి, ముందుకువాలి తదేకధ్యానముగా ఏదో వ్రాయుచుండెను. భూపతి బాగా దగ్గరకు వచ్చి నిలుచున్నతరువాత చారుకు చైతన్యముకలిగినది; ఆమె తొందరతొందరగ పుస్తకమును కాళ్ళక్రింద దాచినది.

మనస్సులో బాధగానున్నప్పుడు ఎంతచిన్న దెబ్బయైనను పెద్దదిగా తోచును. కారణములేకయే చారు అంతతొందరతొందరగ పుస్తకము దాచుట చూడగానే భూపతి మనస్సుకు గాయము తగిలినది.

భూపతి మెల్లగ వచ్చి మంచముపై కూర్చుండెను. తన రచనాస్రోతస్సుకు అనుకొనని అడ్డువచ్చుటచేతను, భూపతి కనబడినతోడనే పుస్తకము తడబడుచు దాచుటవలన మనస్సు వికలమగుటచేతను చారుకు సంభాషణకు సరియైనమాటలు తట్టలేదు.

తాను చెప్పగలిగినది కాని ఈయగలిగినది కాని భూపతి వద్ద ఆనాడేదియు లేదు, వట్టిచేతులతో ప్రార్థించవలె చారుదగ్గరకు వచ్చియుండెను. ఆదరముతో చారు ఒక్కమాట అనియుండిన

యెడల అతనిగాయముపై మందుపడి బాధ మాయమై యుండును. భాగ్యహీనులయెడల లక్ష్మి ప్రసన్నురాలు కాదు. ప్రేమభాండాగారము ఒక్క నిమిషముపాటు తెరచుటకైనను తాళముచెవి చారుకు దొరకలేదు. వీరి కఠోరమౌనము ఇంటి నిశ్శబ్దతను మరింత గాఢము చేసినది.

భూపతి కొంతసేపుమాటాడక కూర్చొని, పెద్దనిట్టూర్పు విడిచి మంచముపైనుండి లేచి మెల్లమెల్లగ బయటికి వచ్చెను.

ఆసమయములోనే అమల్ తాను చారుతో అనవలసిన కఠినమైనమాటలు మనస్సులో వల్లించుకొనుచు తొందర తొందరగా చారు గదివైపు వచ్చుచుండెను. దారిలో భూపతి కనబడెను. వాడి, వివర్ణమైయున్న అతనిముఖము చూడగానే అమల్ దిగులుపడి, "ఏమి అన్నయ్యా, అట్లున్నావేమి?" అని యడిగెను.

ప్రేమతో నిండిఉన్న అములుని కంఠము వినబడగానే భూపతిహృదయము అశ్రురాశితోనిండి పగిలిపోవుచున్నట్లైనది. కొంతసేపటివరకు నోటివెంబడి మాటలు రాలేదు. కాని చివరకు దుఃఖము నణచుకొని, తాను హాయిగానే ఉన్నానని తెలియజేసి అమితాదరముతో "ఈసారి పత్రికలో నీవ్యాసమేదైన వెలువడినదా అమల్?" అని అడిగెను.

అమల్ తయారుచేసుకొనివచ్చిన కఠినమైనమాటలన్నీ రెప్పపాటులో అదృశ్యమైనవి. తొందరగా చారు గదిలోనికి వచ్చి, "అన్నయ్య అట్లున్నాడేమి వదినా?" అని యడిగెను.

"ఏమీ ? నాకేమియు కనబడలేదే! ఇంకేపత్రికలోనైన ఈ పత్రికను దూషించి ఎవరైన వ్రాసియుండ వచ్చు"నని చారు జవాబు చెప్పినది.

అమల్ అయిఉండదని తల ఆడించెను.

పిలవకయే నేడు అమల్ వచ్చెను. చారు మనస్సుకు ఉల్లాసము కలిగినది తత్ క్షణమే ఆమె తనవ్యాసమును గురించి చెప్పసాగినది. నేడు "అమావాశ్యనాటి కాంతి" అని ఒక వ్యాసము వ్రాయుచుంటిని. దానినతడు చూచుట కొంచెములో తప్పిపోయినది.

అమల్ దానిని చూపించమని తననుతప్పక తొందరపెట్టు ననినమ్మి చారు ఆనోటుబుక్కు కాగితములను కొంచెమిటు నటు కదుపినది. అమల్ ఆమెవంక నొక్కసారి తీవ్రదృష్టితో చూచి ఏమి అనుకొనెనో, ఏమి బోధపరచుకొనెనో గాని నిర్ఘాంత పోయెను. పర్వతమార్గమున పథికుడు నడుచుకొని పోవుచున్న ప్పుడు హఠాత్తుగ మేఘముచెదిరి తానొక వేయిమూరలలో తుగహ్వరములో కాలువేయ బోవుచున్నానని తెలిసికొని చకితుడగును. అమల్ అదేవిధముగ చకితుడయి, ఒక్కమాట యైన నాడక బయటికి వెళ్లిపోయెను.

అమల్ ఎన్నడు నిట్లుచేయలేదు! చారుకు దాని తాత్ప ర్యము బోధపడలేదు.

మర్నాడు భూపతి వేళకానివేళను పడకగదిలోనికి వచ్చి చారును పిలిపించి "చారూ, అమల్‌కు మంచి పెళ్లిసంబంధము వచ్చినది," అని అన్నాడు.

చారు, పరధ్యానముగానుండి "మంచిది ఏమి వచ్చింది," అని అడిగినది.

భూపతి—"పెళ్లి సంబంధము."

చారు—"ఏమి నేను నచ్చలేదా?"

భూపతి బిగ్గరగానవ్వి జబాబు చెప్పెను—"నీవు నచ్చుట విషయమై అమల్‌ని ఇంతవరకు అడగలేదు. అమల్ ఇష్టపడి నప్పటికిని నా కుండు చిన్నహక్కు నేను అంత సులభముగ వదులుకొన దలచుకోలేదే!"

చారు—"ఛా, అటువంటి అసందర్భపు మాటలేమిటి? నీ పెళ్లికి సంబంధము వచ్చినదని చెప్పితివని నేనట్లడిగితి అనుచు చారు ముఖమెర్ర చేసుకొన్నది.

భూపతి—"అట్లైన పరుగెత్తి నీదగ్గరకు వచ్చియుందునా? బహుమతి దొరకునని! ఆశింతునా?

చారు—అమల్‌కు పెళ్లిసంబంధము వచ్చినదా? అట్లైన ఆలస్య మెందుకు?

భూపతి—"బర్ధమాన్ వకీలు, రఘునాథబాబు, తన కుమార్తెనిచ్చి పెళ్లిచేసి అమల్‌ని విదేశానికిపంపగోరుచున్నాడు."

"విదేశానికా?" అని ఆశ్చర్యపడుచు చారడిగినది.

"ఔను విదేశానికి."

"అమల్ విదేశానికి వెళ్లినా? మంచిదే చాలామంచి మాట. అతనితో మాటాడి చూడు."

"నేను చెప్పకముందు నీవతనిని పిలిచి బోధపరచినయెడల బాగుండు నేమో!"

"నేను వేయిసార్లు చెప్పితిని—అమల్ నామాట వినడు. నేను చెప్పను."

భూపతి—పెళ్లి చేసుకొనడని నీకు తోచుచున్నదా ?

చారు—చాలసార్లు నేను ప్రయత్నించితిని ఒప్పించవలెనని—అమల్ ఇష్టపడలేదు.

భూపతి—కాని ఈ సంబంధము వదులుకొనుట మంచిది కాదు. నేను అప్పులలో మునిగిపోయి ఉన్నాను. పూర్వము మాదిరి అమల్‌ని పోషించలేను.

భూపతి అమల్‌ని పిలిపించి అడిగెను—బర్ధమాన్ వకీలు, రఘునాథబాబుగారు, తన అమ్మాయిని నీకిచ్చి పెళ్లి చేసి, నిన్ను సీమ పంపించవలెనని కోరుచున్నారట—నీకది ఇష్టమేనా ?

అమల్—నీవు సమ్మతించినయెడల నా కభ్యంతరము లేదు.

అమల్ మాట విని ఇద్దరును ఆశ్చర్యపోయిరి. అతను అంత సుళువుగా ఒప్పుకొను నని వారనుకొనలేదు.

చారు ఎగతాళిచేయుచు కంఠమెత్తి ఇట్లన్నది—అన్నయ్య సమ్మతించినయెడల తాను సమ్మతించినట్లే! అన్నయనిన ఎంత విధేయత తమ్మునికి! ఈభక్తి ఇంతకాలము ఎక్కడ యుండె నబ్బాయి!

అమల్ చిరునవ్వు నవ్వబోయెను, జబాబీయలేదు.

అమల్ జబాబు చెప్పకుండుట చూచి అతనికి మెలకువ తెప్పించగోరి చారు తీక్ష్ణముగ నిట్లన్నది: "స్వతంత్రము— స్వ-ఇచ్ఛ—వదులుకొన్నానని చెప్పుట దానికంటె మేలు. ఇన్నాళ్లో పెళ్లి అక్కర లేదని నటించుట ఎందుకు? కడుపులో ఆకలి, బయటికి సిగ్గు!"

భూపతి హాస్యముగా జబాబు చెప్పెను: "నీమాట ఆలోచించియే ఆకలి అణచిపెట్టి ఉంచుకొన్నాడు, తోటి కోడలి మాట వినగానే ఈసుకలుగునేమో యని!"

చారు ముఖమెఱ్ఱచేసుకొని గొడవచేసినది.—"ఈసా! ఆహా, సందేహమేమి! ఈసట! నాకెందు కీసు—నీవాలాగు అనుట చాల తప్పు!"

భూపతి—ఇదిగో చూచితివా! నాభార్యతో నేనే వేళాకోళమాడ కూడదట!

చారు—అటువంటి వేళాకోళము నాకిష్టములేదు.

భూపతి—సరే! గొప్ప అపరాధముచేసితిని క్షమించుము. కాని ఏదెట్లైనను పెళ్లిమాత్రము స్థిరమేనా?

అమల్—ఆహా.

చారు—పిల్ల మంచిదో కాదో చూచి వచ్చువరకు ఓర్చియుండ లేరు కాబోలు; మీకంత దుర్దశపట్టినదని నేనెన్నడు అనుకొనలేదు.

భూపతి—"అమల్, పిల్లను చూడవలెనని నీకున్నయెడల చూచేయేర్పాటు నేను చేయగలను—అమ్మాయి చక్కనిదని విన్నాను."

అమల్—"చూచుట కవసరము కనబడలేదు."

చారు—"అతని మాట వినుటఏల? వధువును చూడకయే ఎన్నడైన పెళ్లి నిశ్చయించగలమా? అతను చూడకోరకున్నను మనము చూడవలెను."

అమల్—"వద్దన్నయ్యా, దానికొరకై వృథాగా ఆలస్యముచేయుట నాకిష్టములేదు.

చారు—"ఔను, ఆలస్యము చేయకూడదు. గుండె బద్దలై పోగలదు—పెళ్లిముస్తాబుతో ఇప్పుడే బయలుదేరు అమల్! నీబంగారు రాణీని, నీమాణిక్యమును ఎవరైన ఎత్తుకొని పోగలరు!"

ఎంత పరిహాసముచేసినయైనను చారు అమలుని మనస్సు త్రిప్పలేక పోయినది.

చారు—"సీమ పోవుటకు నీ మనస్సట్లు పరుగెత్తుచున్న దేమి? ఇక్కడ నీకేమి కట్టిపెట్టి ఉంచితిమా లేక నిన్ను కొట్టుచున్నామా? పంట్లాము తొడుగుకొని హ్యాట్ పెట్టుకొననిచో నేటి యువకులకు తృప్తిలేదు. ఏమి అబ్బాయీ, సీమనుండి తిరిగి వచ్చి మావంటి నల్లవారిని పోల్చుకొనగలవా?"

అమల్—"పోల్చుకొనగలిగినయెడల సీమవెళ్లి ప్రయోజనమేమి?"

భూపతి నవ్వుచు ననెను—"నల్లనిరూపు మరచుటకే సప్తసముద్రములు దాటుట. కాని నీవు భయపడనక్కరలేదు. మేమందరము నున్నాము—మేముండగా నలుపును పూజించు భక్తులకు లోటుండదు."

భూపతి మిక్కిలి సంతోషించి, తత్‌క్షణమే బర్ద్వాన్ ఉత్తరము వ్రాసి పెళ్లిముహూర్తము నిశ్చయించెను.

ఇంతలో వార్తాపత్రిక నిలపవలసివచ్చినది—భూపతికి మరి డబ్బులేకపోయినది. లోకుల కుపకారమగు పనిచేయ నిశ్చయించుకొని శక్తి వంచనలేక రాంత్రింబగళ్లు ఎన్నాళ్లనుండో చేయబూనిన పనియంతయు ఒకక్షణములో విడిచిపెట్టవలసి వచ్చినది. కడచిన పన్నెండేళ్లనుండి విరామములేక తాను చేయుచుండిన ప్రయత్నమంతయు నీటిమధ్యకువచ్చి హఠాత్తుగ ఆగిపోయినది. ఇట్లు జరుగవచ్చునని భూపతి ఎన్నడు ననుకొనలేదు. హఠాత్తుగ నిట్లు నిలపబడిన ప్రయత్నములను ఇప్పుడత డెటువైపునకు త్రిప్పగలడు ? ఆ ఉద్యమములన్నియు తిండికిలేక బాధపడుచుండు అనాథశిశువులవలె భూపతి ముఖమువంక చూచుచున్నట్లుండెను. వానిని తన అంతఃపురములోనికి తీసికొనిపోయి కరుణామయయు శుశ్రూషాపరాయణయు నైనట్టి స్త్రీ ఎదుట నిలబెట్టెను.

ఆస్త్రీ అప్పుడేమి చేయుచుండెను. ఆమె తనలో తాననుకొనుచుండెను—"ఏమీా ఆశ్చర్యము! అమల్ పెళ్లిచేసికొనునట! మంచిమాటయే! కాని ఇంత కాలము మాయింటనుండి, పై

పిల్లను వివాహమాడి హఠాత్తుగ విదేశముపోవ నిశ్చయించు చున్నప్పుడు ఒక్కనిమిషముపాటు లేశమైన సంకోచమతనికి కలుగలేదే! ఇన్నాళ్లు ఎంతశ్రద్ధతో సేవచేసి ఇంటిలో నుంచు కొంటిమి—వెళ్లిపోవుటకవకాశము దొరకగానే, ఎప్పుడు సందు దొరకునోయని చూచుచున్నవానివలె తత్‌క్షణము నడుము బిగించుకొని వెళ్లిపోయెను. ఐనను మాటలలో నెంతప్రేమ, ఎంత మాధుర్యము చూపుచుండెను! మనుష్యులను పోల్చు కొనుట కష్టము! అంతచక్కగ వ్రాయగలవానికి హృదయ మనునది ఉండదని ఎవ రనుకొనగలరు?

చారు తనహృదయపరిపూర్ణతను అమలుని హృదయ శూన్యతతో సరిపోల్చిచూచి అతని తృణీకరింప ప్రయత్నము చేసినది కాని చేయలేకపోయినది. లోలోపున తీవ్రవేదన యొకటి తప్తశూలమువలె ఆమె అభిమానమును పొడిచి మీదికి ఎత్తుచుండెను.

అమల్ నేడుకాక రేపు వెళ్లిపోవుచున్నాఁడు, ఐనను ఒక్కమారైన కనబడకున్నాడే!

ఈనడుమను ఇరువురిలో లోలోపల పరస్పర విరోధము కొంత కలిగినది. దానిని సరిచేసుకొనుట కవకాశము చిక్క లేదు. ఇన్నాళ్లనాటి తమ ఆటపాటలు ఈవిధముగా అంత మగునని చారు అనుకొనలేదు. అమల్ అవకాశము కల్పించు కొని తానే వచ్చునని చారు ప్రతినిమిషము ఎదురుచూచు చుండెను—కాని అమల్ రానేలేదు. తుదకు అమల్ వెళ్లి

పోవుదినము బాగా దగ్గరపడుటవల్ల చారు తానే అమల్‌ని పిలిపించినది.

కొంచెముతాళి వచ్చెదనని అమల్ జబాబు చెప్పెను.

చారు ప్రతిదినము తాము కూర్చుండెడి వరండామీదికి వెళ్లి మామూలు కుర్చీమీద కూర్చున్నది. ఉదయమునుండి దట్టమైన మేఘము లాకాశము నావరించియుండుటచే మిక్కిలి ఉక్కగానున్నది. జుట్టు తలమీద కుప్పగాపెట్టి విసనకర్రతో మెల్లగ విసరుకొనుచున్నది.

చాలాసేపిట్లు కూర్చున్నది. విసనకర్ర ఆగిపోయినది. దుఃఖము, కోపము, అసహనము ఆమెమనస్సులోపల పరిస్ఫుటమైనవి. "అమల్ రాలేదు——రాకపోయిన మాత్రమేమి?" అని చారు తనలో తాననుకొనుచున్నది. కాని అడుగుల చప్పుడు చెవినిపడినంతమాత్రాన ఆమెమనస్సు ద్వారమువైపు పరుగెత్తుచున్నది.

దూరాన చర్చి - గడియారము పదునొకండు కొట్టినది. భూపతి ఇప్పుడే స్నానము చేసి భోజనమునకై వచ్చును. ఇంకను అరఘంట సమయమున్నది. ఈలోగా అమల్ రావచ్చును. వారిరువురిలో జరిగిన నీరవ-కలహము పరిష్కారము చేసికొవలెను——ఇట్టిమనస్సుతో అతనిని సాగనంపకూడదు కదా! వదిన మరదులది ఒకేవయస్సు, అనురాగముకొలదీ ఎన్నోమార్లు పోట్లాడుకొన్నారు, జట్టు విప్పుకొన్నారు, దగ్గరకూర్చొని అతిప్రేమతో పూర్వపుకథలెన్నో చెప్పుకొనుచు ఆనందించు

చుండిరి. అమల్ వానినన్నిటిని మంటిలోకలిపి దూరదేశము పోయి ఎన్నాళ్లవరకో రాకుండగ అక్కడనుండి పోగలడా! కొంచెము పరితాపమైన నుండదా, వదిన మరదుల మెంత అన్యోన్య ప్రీతితో నుంటిమోయని జ్ఞప్తికివచ్చి కొంచెము కన్నీటినైన విడవడా!

సుమారు అరగంట ఐపోయినది. చారు చింపిరిజుట్టును వ్రేళ్లతో వడిగా దువ్వుచున్నది, ముడివేయుచు విప్పుచున్నది. కన్నీరాపుకొనుట ఆమెకు మరి సాధ్యము కాకున్నది. అంతలో నౌకరువచ్చి, "అమ్మగారూ, బాబుగారికొరకు నీటికొబ్బరికాయ ఈయండి," అని యనెను.

చారు పైటచెంగునుండి తాళముచెవులగుత్తిని విప్పి నౌకరు కాలిదగ్గర విసరినది. నౌక రాశ్చర్యపడి తాళముల గుత్తి తీసికొని పోయెను.

చారుగుండెలోనుండి బరువేదో మీదికివచ్చి గొంతుక కడ్డుపడుచున్నది.

మామూలువేళకు నవ్వుముఖముతో భూపతి భోజనమునకు వచ్చెను. విసనకర్ర చేతపుచ్చుకొని చారు భోజనస్థలమునకు వచ్చినది. అమల్ భూపతితోకలసి లోనికివచ్చెను. చారు అమల్ ముఖమువైపు చూడనే లేదు.

అమల్—"నన్ను పిలిచితివా వదినా?"

చారు—"ఇప్పుడు మరి అవసరము లేదు."

అమల్—"అట్లైన నన్ను పోనిమ్ము, ప్రయాణమునకు సరుదుకొనవలసినవి అనేకములున్నవి."

చారు కల్లెర్రచేసి అమల్ముఖమును చూచుచు, "వెళ్లు"మనెను. అమలొకమారు చారువంకచూచి వెళ్ళి పోయెను.

భోజనమైనపిమ్మట చారుతో కలసి కొంచెమునేపు కూర్చుండుట భూపతి కభ్యాసము. కాని నేడు చూడవలసిన జమాఖర్చులు అనేకముగ నుండుటచేత మామూలు ప్రకారము కూర్చుండియుండలేనని తోచి కొంచెము విసుగుకొనుచు, "నే డాట్టేసేపు కూర్చొనలేను చారూ, చాలాచీకాకు పనియున్నది," అని యన్నాడు.

చారు—"అట్లైన వెళ్లు,"

చారు అభిమానముకొలది అన్నదని తోచి, భూపతి, "అట్లని ఇప్పుడే పోవలెనని నే ననలేదు—ఆట్టేసేపు కూర్చుండ లేను. కొంచెము విశ్రాంతితీసికొని వెళ్లెదనంటి" నని భూపతి యనెను. అని కూర్చుండెను, కాని అతనికి అసంతుష్టిగానే ఉండెను.

ఏదో సంభాషణలోనికి దిగవలెనని భూపతి ప్రయత్నము చేసెను, కాని ధోరణి కుదరలేదు. ప్రయత్నము వృథాయగుట కనిపెట్టి భూపతి చివరకు—"అమల్ రేపు వెళ్ళిపోవుచున్నాడు. ఒంటిరిదానవై పోవుదువు; నీకు మరీ తోచదేమో," అని యనెను.

చారు జబాబుచెప్పలేదు. ఏదో పనియున్నట్టు నటించి ప్రక్కగదిలోనికి వెళ్లిపోయినది. భూపతి కొంచెముసేపు వేచి యుండి బయటికి తనపనిమీాద వెళ్లిపోయెను.

చారు అమల్‌వంకచూచి కనిపెట్టినది—అమల్ మిక్కిలి నీరసముగ కనబడుచుండెను. ముఖమున ఆ తరుణకాంతి, ఆ ఉత్సాహము లేనేలేవు. అది చూచి చారుకు దుఃఖము కలిగినది, సుఖముకూడ కలుగకపోలేదు. సమీాపించుచున్న ఎడబాటే అమలుని దుఃఖమునకు కారణము—ఎట్టిసందేహమును లేదని చారు నమ్మినది. కాని అమల్ ఇట్లు వ్యవహరించుచున్నాడేమి? అట్లు దూరముగానుండి తప్పించుకొని తిరుగుచున్నాడేమి? వెళ్ళిపోవువేళను విరోధముతో మనసులనిట్లు పంకిలము చేయుచున్నాడేమి?

మంచముపై పరుండి ఏదో ఆలోచించుచు చారు త్రుళ్లిపడి హఠాత్తుగలేచి కూర్చున్నది. హఠాత్తుగ నామెకు మందాకిని మాట జ్ఞప్తి వచ్చినది. 'అమల్ మందాకినిని ప్రేమించుచున్నాడేమో! మందాకిని వెళ్లిపోవుటచే అమల్ ఇట్లు—ఛీ!' అమల్ మనస్సు అటువంటిది కాగలదా! అంతనీచమా? అంత కలుషమా? వివాహిత రమణిచే ఆకర్షింపబడునా? అసంభవము! చారు ఆసందేహమును తన యావచ్ఛక్తిని ప్రయోగించి త్రొక్కివేయ ప్రయత్నించినది, కాని అది ఆమెనే మ్రింగి వేయుచుండెను.

ఇట్లుండగా అమల్ వెళ్లిపోవు సమయము వచ్చినది. మేఘ మింకను వదలలేదు. అమల్‌వచ్చి వణకుమాటలతో, "వెళ్లుచున్నాను వదినా, అన్నయ్యను జాగ్రత్తగ చూచు చుండుము. గొప్ప ఆపదసమయము, అతనికి సాంత్వన మీయ గల దానవు నీవొకతెవే!" అని యనెను.

భూపతియొక్క నిరుత్సాహము, వాడిన ముఖము చూచి అమల్ అతని దురవస్థనుగురించి తెలుసుకొనెను. అతడు తన దుర్దశతో ఎటువంటి గందరగోళమునుచేయక ఒంటరిగా పోట్లాడుచుండెను. అతనిని ఓదార్చువారుగాని, అతనికి సహాయ పడువారుగాని లేకుండిరి. ఐనను తాను పాలించుచున్న బంధు వులకుగాని, ఆశ్రితులకుగాని తన ప్రమాదావస్థవలన ఎట్టి తొందర కలుగకుండునట్లు చూచుచుండెను. దీనినిగురించి ఆలోచించుచు అమల్ మాటాడక నిలబడియుండెను. తరువాత చారుమాట, తనమాట అనుకొని ముఖమెర్ర చేసికొన్నాడు. కొంతసేపైనతరువాత ఛటీమని ఈవిధముగా అన్నాడు— 'ఆషాఢచంద్రుడు' 'అమావాశ్యకాంతి' మంటగలసిపోనీ! నేను సీమవెళ్లి బారిష్టరీ పాసయివచ్చి అన్నయ్యకు సాయముచేసి నప్పుడే నేనొక పురుషుని క్రింద లెక్క."

గతరాత్రియంతయు నిద్రలేక అమల్ సెలవుతీసికొని వెళ్లిపోవునప్పుడు ఏమేమి అనవలెనో చారు నిశ్చయించుకొను చుండెను. నిష్ఠూర్యమును, అభిమానమును, ఔదాసీన్యమును ఆమాటలలో పెట్టి వాటిని వాడిచేసి సిద్ధముగా ఉంచినది. కాని

ఆవేళకు చారు నోటివెంబడి వానిలో ఒక్కమాటయైనను రాలేదు — "ఉత్తరము వ్రాయుచుండుము అమల్," అని మాత్ర మనగల్గినది.

అమల్ భూమికి తలను తగిలించి చారుకు ప్రణామము చేసెను. చారు పరుగెత్తి పడకగదిలోనికిపోయి తలుపులు మూసికొన్నది.

భూపతి బర్ద్ధమాన్ వెళ్ళి అమల్ వివాహాంతమున అతనిని విదేశమునకు సాగనంపి ఇంటికి తిరిగివచ్చెను.

నాలుగువైపులను దెబ్బలుతినుటవల్ల విశ్వాసపరాయణుడైన భూపతికి ఒకవిధమగు వైరాగ్యముకలిగినది. సభాసమాజములలో, నలుగురితో కలసిమెలసి తిరుగుట కనిష్టతకలిగినది. "ఇంతకాలము వీనితో నన్ను నేను మోసపుచ్చుకొనుచుంటిని. సుఖముగా నుండవలసినదినములు గడచిపోయినవి. జీవనములో అన్నిటికంటె సారమైనభాగమును మురికికుండీలో పారవైచితిని," అని అనుకొనసాగెను.

"పత్రిక పోయింది, మంచిపని యైనది, మోక్షము దొరికినది," అని భూపతి తనలో తా ననుకొనెను. చీకటిపడుచుండుట చూచినతోడనే పక్షులు తమతమ గూళ్లకు తిరిగి వచ్చుచుండును. అదేవిధముగ భూపతి దీర్ఘదినమంతయు పనితో తిరుగుచుండెడి తావుల నన్నిటిని విడిచిపెట్టి అంతఃపురములోనికి, చారువద్దకు, వచ్చి చేరుకొనెను. "ఇక మరియెక్కడికిని పోను, ఇదియే నా స్థిరమైనస్థలము. నేను రోజంతయు ఆటాడుచుండిన,

కాగితపుపడవ మునిగిపోయినది, ఇక నే నింటికి వచ్చిచేరితి”నని అనుకొనెను.

భార్యలపై నధికారము మనము ప్రయత్నముచేసి సంపాదించనక్కరలేదని అందరివలె భూపతికూడ నమ్ముచుండెను. భార్య ధ్రువతారవంటిది—తనలోపలనుండు కాంతివల్లనే వెలుగుచున్నది. గాలికి ఆరదు, వెలుగుచుండుటకు చమురవసరములేదు. బయటిభాగము కాలిపడుట ప్రారంభించగానే భూపతి అంతఃపురములోనికి వెళ్ళిపోయెను. కాని లోపల వ అర్చిలోనైన పగులుండవచ్చునని అత డనుమానించలేదు, పరీక్ష చేయవలెనని అతనికి తట్టలేదు.

భూపతి బర్ధమాన్‌నుండి తిరిగివచ్చినప్పటికి సాయంకాలమైనది. కాళ్లుచేతులు కడుగుకొని పెందలకడ భోజనము ముగించెను. అమల్ పెళ్లినిగురించి, అతని సీమప్రయాణమునుగురించి, మొదటినుండి చివరవరకు, సవిస్తరముగ, వినుటకు చారు ఆతురపడుచుండుననని భూపతి త్వరగా సిద్ధపడెను. భూపతి పడకగదిలోనికి వచ్చి మంచముపై పరుండి గుడుగుడు పీల్చుట మొదలుపెట్టెను. చారు ఇంకను రాలేదు. ఇంటిపనిచేయుచున్నది కాబోలు. తమాకయిపోవునది. అలసియుండుటచేత భూపతికి నిద్రవచ్చినది. నిద్రలో మధ్యమధ్యను లేచి చారింకను రాకుండుటకు కారణమేమని అనుకొనుచుండెను. తుదకు ఉండలేక చారును పిలిపించి, “నేడింత ఆలస్యమేమి చారూ?” అని అడిగెను.

చారు దానికి జబాబీయక, "ఔను ఆలస్యమైనది," అని అన్నది.

చారు అతి ఆత్రతగా అడుగునని భూపతి తలచెను. ఆమె అడగకుండుట చూచి భూపతి నిరుత్సాహపడి, "అట్టిన అమల్ యెడల చారుకు అనురాగ మింత స్వల్పమా?" అని యనుకొనెను. అమలుడును ఆమెయుకలసి ఉన్నన్నాళ్లు సదా ఆడుచు పాడుచు కాలక్షేపము చేయుచుండిరి. అతడు వెళ్లిపోయినతోడనే ఇంత ఉదాసీనతా! ఈ ఆసక్తిహీన స్వభావముచూచి భూపతికి కొంత అసంతుష్టి కలిగినది. చారు హృదయము ఇంత గంభీరతలేనిదా? ఆమోద వినోదము లెరుగునుగాని ప్రేమ ఎరుగదా! ఇంత అసక్తి లేని స్వభావము స్త్రీలలో మంచిదికాదని భూపతి నమ్మకము.

చారూ అమలుల మైత్రిచూచి భూపతి ఆనందించుచుండెను. వారి కుర్రతరహా స్నేహము, కలహములు, ఆట, మొదలైనవి భూపతికి వినోదకరముగాను, కుతూహలకరముగాను ఉండెను. చారు చేయు సంరక్షణలోను, ఆమె కనపరచు ఆదరణలోను ఆమెహృదయములోనున్న కోమలత వ్యక్తమగుట చూచి భూపతి సంతోషించుచుండెను. అదియంతయు పైపైదా? దానికేమియు పునాదిలేదా? అని ఆశ్చర్యపడి ప్రశ్నించసాగెను. చారు అంతహృదయములేనిదైనయెడల అతని కెట్లు ఆశ్రయ మీయగలదు!

నిజము కనుక్కొనగోరి భూపతి చారును, "నీ ఒంట్లో ఏలాగున్నది చారూ, సుస్తిగా లేదుకదా?" అని అడిగెను.

చారు అతిక్లుప్తముగా జబాబు చెప్పినది, ఒంట్లో జబ్బేమియును లేదని.

భూపతి—"అమల్ వెళ్లి అయిపోయినది."

భూపతి ఈమాట లని ఊరకయుండెను. ఎంత ఆలోచించినను మాటలాడుటకు నవిషయము తట్టలేదు—నోటివెంబడి మాట రాలేదు.

దేనినైన బాగాపరికించి చూచు స్వభావముకాదు భూపతిది. కాని అమల్ వెళ్లినప్పటినుండి అతని మనస్సులో బాధగానుండుటచే, చారు ఉదాసీనత అతని మనస్సుకు కష్టము కలిగించినది—తనవలె విచారించు చారుతో కలసి అమలునిగురించి మాటలాడుచు తన మనోభారము తగ్గించుకొనకోరెను.

భూపతి — "పిల్ల బహు చక్కనిది — నిద్రపోవుచున్నావా చారు ?"

చారు—"లేదు."

భూపతి — "అమల్ ఒంటరిగా వెళ్లిపోయినాడు, పాపము. బండిలో ఎక్కునప్పుడు పిల్లవానివలె ఏడ్వసాగెను. అది చూచి పెద్దవాడను నేనుకూడ కన్నీ రాపుకొనలేక పోతిని. బండిలో ఇద్దరు దొరలుండిరి. మగవాళ్లిట్లేడ్చుచుండుట వారికి వింతగా నుండెను."

దీపములేని పడకగదిలో మంచముమీద పరుండియున్న చారు ఒకప్రక్కనుండి మరియొకప్రక్కకు తిరిగి, కొంచెముసే

పైనతరువాత హఠాత్తుగ లేచి బయటికి వెళ్ళిపోవుచుండగ భూపతి "ఏమి—ఒంట్లో ఎట్లున్నది చారూ ?" అని కంగా పడుచు అడిగెను.

చారు జవాబుచెప్పలేదు. కొంతసేపైనపిమ్మట బయ నుండి రుద్ధకంఠములోనుండి వచ్చుచున్న ఏడ్పు వినబడ్డది— భూపతి దిగులుపడి బయటికి వచ్చిచూచెను. చారు వరండా మీద నేలను బోరగిలపడుకొని ఏడ్పు ఆపుకొన ప్రయత్నించు చున్నది.

చారిట్లు ఆపుకొనలేక ఆపుకొనలేక ఏడ్చుచుండుట చూచి భూపతి ఆశ్చర్యపడెను. చారు విషయమై పొరపాటు పడితినని అత ననుమానించెను. దుఃఖము నాయెదుటకూడ బయలుపడనీయదు — ఆమెది అంత అణచిపెట్టుకొనియుండు నైజమూ !

అట్టి స్వభావముగలవారికి ప్రేమవలె దుఃఖముకూడ గాఢముగనే యుండును. చారు ఇతరస్త్రీలవలె తన హృదయ ములోనున్న ప్రేమను నలుగురియెదుట ప్రదర్శింపవలసినది కాదని భూపతి పోల్చుకొనెను. చారు జీవితములో ప్రేమ బయటికి పొంగిపొరలి వచ్చుచుండుట భూపతి ఎన్నడు చూడ లేదు. అది లోపల బాగుగ విస్తరించియుండుటయే దానికి కారణమని నేడు భూపతికి స్పష్టమైనది. భూపతికికూడ మనో భావములు బయటికి ఎక్కువగా కనపరచుట చేతకాదు. హృదయవేగము లోపల నుంచుకొనుచుండుటయే చారు స్వభావమని నేడు కనిపెట్టుటవలన భూపతికి తృప్తికలిగినది.

అత నామె ప్రక్కను కూర్చుండి మాటలాడక ఆమె దేహమును నిమురసాగెను. ఆమె నెట్లు ఓదార్చవలెనో అతనికి తెలియలేదు. కాని యెవ్వరైన అంధకారములో కూర్చుండి తమ దుఃఖమును అణిచిపెట్టుకొన ప్రయత్నించుచున్నప్పుడు, దగ్గర సాతులుండుట వాళ్లకు ఇష్టముగ నుండదు—ఈ మాట భూపతి యెరగడు.

పత్రికపని మానుకున్నప్పటినుండి భూపతి తీరికగా కూర్చొని తన భవిష్యత్తు నూహించుకొనుచు ఒక దృశ్యమును మనఃఫలకముపై చిత్రించుకొనెను. దురాశ తన కక్కరలేదని నిశ్చయించుకొనెను. అందని పళ్లు కాశించక చారును ప్రేమించుచు, ఆమె చదువు సంధ్యలను నడుపుచు, చిన్న చిన్న దైనిక గృహకర్తవ్యములను పాలించుచుందునని నిశ్చయించుకొనెను. గార్హస్థ్య సుఖములు సులభముగా మనకు అందుబడిలోనున్నవి, ఐనను మనోరంజకమైనవి; గృహకృత్యములు మనము చేయగలవి, ఐనను బహుపవిత్రమైనవి. సులభముగ మనము పొందగల ఈ సుఖములతో సంధ్యాదీపమును వెలిగించుకొని శాంతితో కాలము గడపవలెనని భూపతి ఆశింపసాగెను; హాసపరిహాసములతోను, సుఖసంభాషణతోను పరస్పరమనోరంజనము చేసుకొనుచుండవలెనని కోరుట మొదలుపెట్టెను. ఇంతకు మించిన ప్రయత్నము అనావశ్యకము—కావలసినంత సుఖము దీనివలన ఎడతెరిపిలేక పొందగలనని అతనికి విశ్వాసము కలిగినది.

క్రియలోనికి దిగినప్పుడు 'సులభము' సులభము కాదని స్పష్టమౌను.

వెలకు దొరకని వస్తువు, తనయంతటట తానే మనచేతిలో పడినప్పుడు తప్ప, మనమెంత ప్రయత్నము చేసినను, ఎక్కడ వెదకినను, మనకు దొరకదు.

భూపతి చారుతో కలసి సహజముగా హాయిగా సంభాషణ చేయలేకపోవుచుండెను. ఇది తన తప్పువల్లనని నమ్మి భూపతి తనను తాను నిందించుకొనుచుండెను. పన్నెండు సంవత్సరములు కేవలము వార్తాపత్రికకు వ్రాయుచు కూర్చొని భార్యతో సంభాషించు శక్తి పూర్తిగా పోగొట్టుకొనెను. సంధ్యా దీపము వెలిగించినతోడనే భూపతి ఇప్పుడు ఆత్రతతో ఇంట్లోనికి వచ్చుచున్నాడు. అతడు ఒకటి రెండు ప్రశ్నలు వేయు చుండును. చారు జబాబు చెప్పుచుండును. తరువాత, మాట్లా డుటకు ఏమియుతట్టదు. తన అసమర్థతను చూచి భూపతి భార్య ఎదుట సిగ్గుపడుచుండెను. భార్యతో కబుర్లుచెప్పుకొని కూర్చొని యుండుట వంటి సులభమగు పని మరియొకటి యుండదని అత డనుకొనుచుండెను, కాని తనవంటి మూర్ఖునకు అది బహు కష్టసాధ్యమని యిప్పుడు తెలిసికొన్నాడు——సభలలో ఉప న్యాసము లిచ్చుట ఇంతకంటె మిక్కిలి సులభము !

ఏ సంధ్యాసమయమును హాస్యకౌతుకములతోను ప్రణ యాదరములతోను రమణీయముగా చేసికొనగలనని యూహించు చుండెనో ఆసంధ్యాసమయమును గడుపు టనునది ఒక గొప్ప సమస్యరూపము ధరించినది. కొంతసేపు నిశ్శబ్దప్రయత్నము చేసిన పిదప భూపతికి లేచిపోదమని బుద్ధిపుట్టుచుండును. కాని

చారేమైన అనుకొనునేమో యని సందేహించి లేవక కూర్చొని యుండును. "పేకాట ఆడుదమా చారూ ?" అని భూపతి అడుగుచుండును. విధిలేక చారు, "ఆడుద"మను చుండును. అనుచు ఇష్టములేకపోయినను పేకదస్తా తెచ్చి ఆట ప్రారంభించుదురు. తప్పాట ఆడి చారు వీగిపోవుచుండును— అట్టి ఆటవల్ల ఎవరికిని ఆనందముండదు.

భూపతి చాలా ఆలోచించి ఆలోచించి చారుతో ఒకనా డన్నాడు— "మందను రమ్మనిన బాగుండునేమో చారూ, నీవు కేవలము ఒంటరిదానవై పోతివి !".

మందాకిని పేరువినగానే చారు మండిపడి, "అక్కరలేదు, మంద నా కవసరము లేదు," అని యన్నది.

భూపతి నవ్వెను—లోలోపల సంతోషించెను. పతివ్రత ధర్మమును పాలించుటలో ఎవరిలో నెట్టిలోటు కనబడినను సాధ్వీమణులు సహించి ఊరుకొనలేరు.

మొదట ద్వేషముకొలది చారు ఆజబాబుచెప్పినది. కాని ఆద్వేషము కొంచెముతగ్గగానే మంద ఉండినయెడల భూపతికి కొంత ఆమోదకరముగ నుండవచ్చునని ఆమెకు తోచినది. తనయొద్దనుండి భూపతి ఏసుఖము నాశించుచున్నాడో ఆసుఖమును తానీయ లేదని తెలుసుకొని చారు దుఃఖంపసాగినది. భూపతి బయటిప్రపంచములో సర్వమును విడిచిపెట్టి యావదానందమును కేవలము తనమూలముననే పొందుటకు ఏకాగ్ర చిత్తుడై ప్రయత్నించుచున్నాడని తెలియగానే, తన మనో

దైన్యత తానెరుగును గనుక, చారు దిగులుపడ్డది—ఇట్లెన్నాళ్లు జరుగగలదు ? ఏదైన మరియొకపని భూపతి ప్రారంభించడేమి ? క్రొత్తవార్తాపత్రిక యొకటి మొదలుపెట్టడేలకో! భూపతి చిత్తరంజనకొరకేమిర్తైన చేయుచుండుట చారకు నేటివరకూ వశ్యకము కాలేదు. భూపతి ఆమెసేవ నాశించలేదు. ఎట్టిసుఖము కొరకైన నామెను వేడలేదు. అన్ని విధములను తనకామె ప్రయోజనకరమగునట్లు ఆమెనుచేయుటకు భూపతి నేటివరకు ప్రయత్నించలేదు. ఇప్పుడు హఠాత్తుగ నాకు సర్వమును నీవే యనుట వలన ఏమిచేయవలెనో చారుకు తోచలేదు. భూపతి కోరుచుండినదేమో, దేనితో నతనిని తృప్తిపరుపవచ్చునో, చారుకు బోధపడలేదు. తెలిసినను చారు చేయగలదేమియు లేదు, చేయుశక్తి ఆమెలో లేదు.

భూపతి కొంచెము కొంచెముగ ముందుకు నడచినచో చారుకింత కష్టము కలిగియుండదేమో!—కాని అతడు ఒక్క రాత్రిలో దివాలాదై వట్టిచేతులు చాచుకొని ఎదుటకు వచ్చి నిలిచెను—చారు కేమియు తోచలేదు.

"సరే రమ్మని మందాకినికి కబురు పంపుము. నీకు సరియైన సంరక్షణ జరుగుటలేదు. ఆమె వచ్చినయెడల కొంత ఉపకారముగనుండు" నని చారు అన్నది.

"నాకొరకా ? నాకొరకవసరము లేదు," అని భూపతి నవ్వుచు ననెను.

భూపతి సిగ్గుపడి, తనలో రసికత లేదనియు, చారు నెట్లు సుఖపెట్టవలెనో తానెరుగననియు తనలో తానసుకొని దుఃఖించెను.

ఇట్లనుకొని సాహిత్య సాధనలో పడెను. మిత్రులు వచ్చి చూచునప్పుడెల్ల, బైరన్, టెనిసన్, బంకిమ్ మొదలగు కవుల గ్రంథముల మధ్యను కూర్చొనియుండెను. మిత్రు లాశ్చర్యపడి ఈ అకాల కావ్యానురాగమును గురించి పరిహాసము చేసిరి. భూపతి, "వెదురునకూడ పువ్వులు పూయవచ్చును, ఎప్పుడు పూయునో ఎవ్వరును చెప్పలే" రని నవ్వుచు జబాబు చెప్పెను.

ఒకనాడు సాయంకాలము పడకగదిలో పెద్దదీపమొకటి వెలిగించి మొదట సిగ్గుతో తడబడుచు కొంచెమిటునటు తిరిగి, "నీకేదైన చదివి వినిపించెదను చారూ," అని యనెను.

చారు—"వినిపించు."

భూపతి—"ఏమి వినుపించు మనుచున్నావు?"

చారు—"నీకిష్టమైనది."

చారులో నెట్టి ఉత్సాహము లేకపోవుటచే భూపతి చదువుటకు సంకోచించి సంకోచించి, చివరకు, "టెనిసన్‌లోనుండి ఏదైన తర్జుమాచేసి చెప్పెద" నన్నాడు.

చారు చెప్పుమన్నది.

సంకోచమువల్లను, నిరుత్సాహమువల్లను ప్రయత్నము మంటగలసినది. చదువుకేదో అడ్డు పడుచుండెను. సరియైన

మాతృభాషా పదములు తట్టలేదు. చారుశూన్యదృష్టిని చూచి ఆమె మనస్సిచ్చి వినుచుండలేదని భూపతి పోల్చుకొనెను. శాంతితో నిండియున్న ఆసంధ్యయును దీపపుకాంతితోనిండి యున్న ఆగదియు భూపతికి శూన్యముగతోచినవి.

భూపతి మరిరెండు మూడు సార్లు ఇదియేరీతిని ప్రయత్నముచేసి హతాశుడై సాహిత్య సాధన మానెను.

పెద్దదెబ్బ తగిలినతోడనే స్నాయువులు వశముతప్పుటచే బాధ ఉన్నట్లు మనకు తెలియదు. ఆలాగుననే అమల్ వెళ్లి పోగానే ఆ విచ్ఛేదమువల్ల కలుగవలసినబాధ చారుకు వెంటనే తెలియలేదు. కాని దినములు గడచిన కొలది శూన్యత నలుదిక్కుల వ్యాపింపసాగినది. ఇదిగ్రహించి చారు హతబుద్ధురాలైనది. కుంజవనమును విడిచి మరుభూమిలోనికి వచ్చిపడినది. రోజులు నడచుచున్నవి. మరుప్రాంతముకూడ నలుదిక్కుల వ్యాపించుచున్నది. ఈ మరుభూమి ఇంతకుపూర్వ మామె ఎరుగదు. నిద్రలేచినతోడనే ఆమెగుండె గభీమనుచుండును— అమల్ లేడే! వరండామీద కూర్చొని తాంబూలము సరుదుచు, 'వెనుకనుండి అమల్ రాడే,' అని ఉండిఉండి అనుకొనుచుండును. ఒకప్పుడు బీడాలనేకము కట్టినతరువాత అవి తినువారెవ్వరును లేరని జ్ఞప్తికి వచ్చుచుండును. కొట్టుగదిలోనికి వెళ్లినప్పుడెల్ల నేడమల్ ఫలాహారమునకై ఏమియునీయ నక్కరలేదని జ్ఞాపకము వచ్చుచుండును. ఓర్చి ఉండలేక మధ్య మధ్య అంతఃపురముదాటి బయటికి రాబోవుచు 'అమల్

నేడు కాలేజినుండి రాడే అని జ్ఞాపకము తెచ్చుకొనుచుండును. క్రొత్తపుస్తకములకొరకుగాని క్రొత్తవ్యాసముల కొరకుగాని, క్రొత్తసంగతులకొరకుగాని ఆశించకూడదు. ఎవరి కొరకును క్రొత్తదేదియైన అల్లియుంచ నక్కఱలేదు, క్రొత్త వ్యాసము వ్రాయనక్కరలేదు, క్రొత్తశౌఖిన వస్తువేదియు కొనియుంచ నవసరములేదు.

భరించరాని తనకష్టమును, కలతను చూచి చారుకే ఆశ్చర్యము కలిగినది. తన మనోవ్యథను చూచి చారు భీతి చెందినది. చారు తనకుతాను ప్రశ్నించుకొన్నది: 'నాకు భరించరాని బాధ ఇట్లేల కలుగుచున్నది? అమల్‌కు నాకుగల సంబంధ మేమిటి ఇంత దుఃఖించుటకు? నాకేమి సంభవించినది? నౌకర్లు, దాసీలు, కూలివారు, ముష్టివారు హాయిగా పాడుకొనుచును తిరుగుచున్నారే, నాకేమి సంభవించినది, ఇంత దుఃఖించుచుండుటకు? నన్నిట్టి విపత్తులో పడవేసితివేల భగవంతుడా!"

చారు మాటిమాటికి తనకుతాను ప్రశ్నించుకొనుచుండెను, ఆశ్చర్యపడుచుండెను. కాని సంక్షోభశమనము మాత్రము కాకుండెను. అమలుని స్మృతి లోపలను బయటను దుఃఖముతో నింపుచుండుటచే ఎచ్చటికైన పారిపోవుటకును లాభముండదు.

అమల్ చారుకు స్మరణకు రాకుండునట్లు ప్రయత్నము చేయగలిగినయెడల ఆమె కొంత మరువగలిగియుండును నేమో! కాని స్నేహశీలుడైన మూఢభూపతి తానుకూడనా విస్మరణము చే

బాధనొందుచుండుటచే మాటమాటకు అమలునే స్మరణకు తెచ్చుచుండెను.

చిట్టచివరకు చారు చుక్కాను వదలుకొని కూర్చున్నది. తనతో తాను పోరాడిపోరాడి అలసి కూలిపడిపోయినది. వీగితి నని ఒప్పుకొని తన నిజమైన అవస్థను గ్రహించినది. శ్రద్ధా పూర్వకముగ అమలుని స్మృతిని తనహృదయ మధ్యమున ప్రతిష్ఠితము చేసికొన్నది.

రానురాను ఏకాగ్రచిత్తముతో అమలుని ధ్యానించు చుండుటయే చారు తనలోతాను గర్వపడుచుండుటకు కారణ మైనది. ఇట్లు స్మరింపగలుగుటయే ఉత్కృష్టమగు కార్యమని చారుకు తోచినది—దీనివల్లనే తాను గౌరవార్హురాలైనదని ఆమె నమ్మకము.

ఇంటిపనులమధ్య నొకసమయము నేర్పరచుకొన్నది— ఆసమయములో గదితలుపులు మూసుకొని ఏకాంతముగా కూర్చొని అమల్ జీవితములోని ప్రతిచిన్నఘటననుగురించి ధ్యానించుచుండెను. తలగడపై ముఖము క్రిందుగా తలనుంచు కొని 'అమల్' 'అమల్' అని మాటిమాటికి అనుచుండెను. సము ద్రముయొక్క అవతలి తీరమునుండి, "ఏమి వదినా?" అని జబాబు వచ్చుచున్నట్లుండెను. తడికళ్లను మూసికొని చారు అడుగు చుండెను—'అమల్, నీవు కోపగించి వెళ్లిపోతివేమి? నేనెట్టి అప రాధమును చేయలేదే. నీవు నవ్వు ముఖముతో సెలవుతీసుకు వెళ్లియుండిన యెడల నాకింత దుఃఖముండకపోను.' అమల్ తన

కళ్ల ఎదుట నిలబడి ఉండినయెడల ఎట్లుమాటాడుచుండునో అట్టి ఉచ్చారణతో మాటలాడుచుండెను—'అమల్ నిన్ను నేనొక్క నాటికి మరువలేదు. ఒక్కనాడు మరువలేదు, ఒక నిమిషము మరువలేదు. నాజీవనములోని శ్రేష్ఠ పదార్థము నీమూలముననే వికాసము పొందినది. నాలో ఉండు ఉత్కృష్ట భాగముతో నిన్ను పూజించెదను.'

ఈరీతిని చారు తనఇంటిపనుల క్రిందినుండి, తన కర్తవ్యముల క్రిందినుండి, సొరంగమొకటి త్రవ్వి, అక్కడి అంధకార నిస్తబ్ధతలో అశ్రుమాలతో అలంకరింపబడ్డ రహస్యమందిరమును నిర్మించి ఉంచుకొన్నది. అక్కడ తనభర్తకుగాని పృథ్విపై నింకెవ్వరికిగాని అధికారములేదు. ఆస్థలము గోపనతమమైనది, గభీరతమమైనది, ప్రియతమమైనది. చారు సంసారములో ధరించిన ఛద్మవేషమును విసర్జించి నిజస్వరూపముతో ఆమందిరమున ప్రవేశించుచుండెను. తిరిగి బయటికి వచ్చునప్పుడు మరల వేషమువేసుకొని పృథ్వియను రంగభూమిని ప్రవేశించి అక్కడి హాసపరిహాసములలోను, క్రియాకర్మలలోను పాల్గొనుచుండెను.

చారు ఈవిధముగ తనకు తనమనస్సుతో జరుగుచున్న ద్వంద్వయుద్ధమును ముగించి అంత గొప్పవిషాదమధ్యమున కూడ శాంతిని స్థాపించుకొనెను; భర్తయెడల భక్తిశ్రద్ధలు కలిగి బహునిష్ఠగా గృహకృత్యములను సలుపుచుండెను. భర్త నిద్రించుచున్నప్పుడు అతని పాదములదగ్గరకువచ్చి పాదధూళి

తీసికొని తన నొసటనుంచుకొనుచుండెను. సేవాశుశ్రూషలలోను, గృహకృత్యములలోను భర్తకోరిక లసంపూర్ణముగనుంచునది కాదు. ఆశ్రితుల సంరక్షణలో నెట్టికొరత కల్గినను భర్త దుఃఖించునని యెరిగి ఎట్టిలోటును లేకుండునట్లు చూచుచుండెను. ఇట్లు చేయుచు భర్త ఉచ్ఛిష్ట ప్రసాదమును భుజించుచు ఆమె దినములు గడపుచుండును.

ఈభక్తి సేవల మూలమున భూపతి తిరిగి నవయౌవనమును పొందెను. చారును ఇప్పుడే వివాహమాడినట్లతనికి తోచుచుండెను. చక్కగ ముస్తాబయి, హాస్యపరిహాసములలో దినమంతయుగడపుచు, దుశ్చింతను మనస్సులో నొకమూలకు త్రోసివేసెను. రోగోపశమనానంతరము ఆకలి వృద్ధియగును, భోగశక్తి వికాసమును అనుభవించగలము. భూపతి మనస్సులో నట్టి ప్రబలమైన అపూర్వ భావావేశము పుట్టినది. స్నేహితులకే కాక చారుకుకూడ తెలియకుండ భూపతి కావ్యగ్రంథములు చదువుట మొదలుపెట్టెను. "వార్తాపత్రిక అంతమైనది, అనేక కష్టములనుభవించితిని—కాని చివరకు నాభార్యను పొందగలిగితిని," అని భూపతి తనలో తానానందించుచుండెను.

"వ్యాసములు మొదలైనవి వ్రాయుట మానివేసితివేమి చారూ?" అని భూపతి చారునొకనా డడిగెను.

చారు—"మహా గొప్పవ్రాత కదూ !"

భూపతి—"నిజము చెప్పుచున్నాను చారూ, నీ అంత చక్కని భాష ఈ నవీనలేఖకులలో ఒక్కరికిని చేతకాదు.

'విశ్వబంధు'లో నీ వ్రాతనుగురించి చేసిన ప్రశంశ జ్ఞాపక మున్నదా—నా అభిప్రాయముకూడ నదియే."

చారు—"ఇక చాలించు."

భూపతి, "ఇదిగో చూడు" మనుచు, ఒక 'సరోరుహ' సంచికతీసి చారు అమలుల కవిత్వములను సరిపోల్చసాగెను. చారుముఖ మెర్రచేసికొని పత్రికను భూపతిచేతిలోనుండి లాగుకొని తన చీరచెంగుతో కప్పినది.

జట్టివరును లేనియెడల కవిత్వము బయటికి రాదని భూపతి తనలోతా ననుకొనెను. తానుకూడ వ్రాయుట అభ్యాసము చేసుకొనవలెనని నిశ్చయించెను. అట్లు చేసినయెడల చారులో నుత్సాహము పుట్టునని నమ్మెను.

భూపతి నోటుబుక్కొకటి కొని అతిరహస్యముగ రచనాభ్యాసము చేయుచుండెను. శబ్దకోశము చూచుచు తప్పు పదములను కొట్టి, క్రొత్తపదములను వ్రాసి, వ్రాసినదానిని సాఫు వ్రాయుచుండెను. ఉద్యోగములేని భూపతికి దినములు ఈ విధముగ గడచుచుండెను. ఇంత ప్రయత్నముచేసి కష్టపడి వ్రాయుటచే భూపతికి తన రచనలయెడల ఆదరముకలిగినది, వానిలో నమ్మకము పుట్టినది.

ఒకనాడు తన రచనను వేరొకరి చేతివ్రాతతో వ్రాయించి, చారుచేత పెట్టి ఇట్లనెను—"నామిత్రుడొకడు క్రొత్తగా వ్రాయ నారంభించినాడు, అది నాకేమియు బోధపడదు, నీ వొక్కసారి చదివి చెప్పు, అ దెట్లున్నదో."

ఇట్లనుచు ఏదోపనినిమిషమైని బయటికి తొందరగ వెళ్లి పోయెను. సరళస్వభావుడైన భూపతి నటన చారు సులభముగ పోల్చుకొన్నది.

చదివినది. వ్రాతధోరణి, విషయము చూచి నవ్వుకొన్నది. ఆహా పాపము! భర్తయెడల భక్తికలిగియుండుటకు చారు ఎంత ప్రయత్నముచేయుచున్నది! అంతకుగ్రతరహాగా ఆమె పూజాసామగ్రిని విరచల్లివేయుచున్న దేమి? చారు వలన మెప్పు పొందవలెనని అతనికి అంత ఆతురత ఎందుకు! చారు మనస్సు నాకర్షించుటకు భూపతి సర్వదా అంతప్రయాస పడకుండి నచో చారుకు భర్తను పూజించుట సులభసాధ్యమైయుండును. భూపతి ఏవిషయములోను తనకంటె తక్కువ కాకూడదని చారు మనసార కోరుచుండెను.

చారు పుస్తకమును తలగడక్రింద పెట్టి బాలీసుపై చేరపడి దూరమునకు దృష్టిని ప్రసరించి చాలసేపటివరకు ఆలోచించుచు కూర్చుండెను—అమల్ కూడ తానువ్రాసిన క్రొత్త వ్యాసములు తెచ్చి ఆమె కిచ్చుచుండెను.

సాయంకాలము భూపతి పడకగది వరండాపైనున్న తొట్టెలలోని మొక్కలను తనిఖీచేయుచుండెను. ఉత్సుకుడై యున్నను తనవ్రాతనుగురించి చారును ప్రశ్నించుటకు సాహసించలేదు.

"అది నీ స్నేహితుని మొదటి వ్యాసమా?" అని చారు తానే అడిగినది.

"ఔను" అన్నాడు భూపతి.

చారు—"చాల చక్కగానున్నది. ఎవ్వరును ప్రథమ వ్యాస మనుకొనరు."

విని భూపతి మిక్కిలి ఆనందించెను—బినామీ కవిత్వమును తనవ్యాసముగ మార్చుటకుపాయమేమి. యని ఆలోచింపసాగెను.

భూపతి నోటుబుక్కు అతిత్వరగా నిండిపోవ నారంభించినది. వ్యాస లేఖరి పేరు బయలుపడుటకుకూడ నాలస్యము కాలేదు.

విదేశమునుండి టపావచ్చుదినము చారు సదా గురుతు పెట్టుకొనుచుండెను. మొట్టమొదట ఏడెన్‌నుండి ఉత్తరము వచ్చినది, దానిలో అమల్ వదినకు ప్రణామములు తెలియచేసెను. సూయెజ్‌నుండికూడ జాబువచ్చినది. దానిలోకూడ అమల్ వదినకు ప్రణామము లర్పించెను. మాల్టానుండి తరువాత జాబువచ్చినది. దానిలోకూడ వదినకు ప్రణామము లుండెను.

చారుపేరను ఒకయుత్తరమైన రాలేదు. భూపతిపేరను వచ్చిన యుత్తరములు తీసి ఇటునుండి అటు అటునుండి ఇటు త్రిప్పిచూచి రెండుమూడుపార్లు చదివినది—ప్రణామములు తెల్పుటతప్ప తన సంగతి ఏమియు లేనేలేదు.

చారు ఈకొద్దిరోజులు దుఃఖముతో కూడిన శాంతినీడను ఆశ్రయముగా చేసికొని యుండెను. అమల్ కనపరచిన ఉపేక్ష

ఆనీడను చెదరగొట్టినది. లోపల హృత్పిండమునెవరో ఇటునటు పీకిచీల్చుచున్నట్టామెకు తోచుచుండెను. ఆమె సంసార కర్తవ్యములలో మరల భూకంప మారంభమైనది.

ఆరోజులలో ఒకొకనాడు భూపతి అర్ధరాత్రివేళను లేచి చూచునప్పటికి చారు మంచముపై నుండునదికాదు. ఒకనాడు వెదుకగా వెదుకగా దక్షిణపుగది కిటికిలో కనబడ్డది. భూపతి కనబడగానే లేచి, "గదిలో అతిఉక్కగా ఉండెను, కొంచెము గాలితగులునేమోయని వచ్చి కూర్చొంటిని," అనియున్నది.

భూపతి గాబరాపడి గదిలో మీదనొక పంకాకట్టించి దానిని లాగించు ఏర్పాటుచేయించెను. ఆమె ఆరోగ్యముచెడు నేమో అని భయపడి సదా ఆమెపై దృష్టినుంచెను. చారు నవ్వుచు, "నీవెందుకు గాబరాపడుచున్నావు, నేను హాయిగానున్నా" ననుచుండెను.

తనగుండెలోనున్న బలమంతయు ప్రయోగించుటవలన గాని ఆనవ్వు నవ్వలేక పోయినది.

అమల్ వెళ్లి విదేశముచేరెను. దారిలోనున్నప్పుడు తనకు ప్రత్యేకముగా జాబువ్రాయుటకు అమల్‌కు వీలుఉండదు కాని విదేశముచేరిన తరువాత తనపేరను పెద్దజాబు తప్పక వ్రాయునని చారు నమ్మినది. కాని ఆపెద్దఉత్తరము రాలేదు.

విదేశటపా రావలసిన దినమున ఆమెచేయుపనులన్నిటి నడుమను అమల్ ఉత్తరముమాట అనుకొనుచు ఆమె ప్రాణములు కొట్టుకొనుచుండెను. భూపతిని అడిగినయెడల నీపేరను

ఉత్తరములేదని చెప్పునేమో యని జడిసి అతనిని అడుగలేకుండెను.

ఆమె ఈ యవస్థలోనుండ విదేశపుపోస్టు రావలసియున్న దినమున నొకనాడు భూపతి మెల్లగ చారుయొద్దకు వచ్చి, "మంచివస్తు వొకటియున్నది చూచెదవా ?" అని యడిగెను.

చారు మిక్కిలి ఆత్రతతో "ఏదీ ?" అని యడిగెను.

భూపతి పరిహాసమాడబోయి చూపించుట కిష్టములేనట్లు నటించెను.

చారు ఓర్చియుండలేక భూపతి కండువాలోనుండి ఆ వస్తువును తీసికొన ప్రయత్నించినది. "నేడు ఉదయమునుండి నాపేరను ఉత్తరము వచ్చునని నామనస్సు చెప్పుచున్నది.— అదెన్నటికి నిష్ఫలముకానేరదు," అని చారు తనలో తానను కొన్నది.

చారుతో పరిహాసము చేయవలెనను ఇచ్ఛ భూపతి మనస్సులో ప్రబలమైనది. అతడు చారుకు దొరకక యుండు నట్లు నవ్వుచు మంచముచుట్టు పరుగెత్త సాగెను.

చారు చీకాకుపడుచు మంచముపై కూలబడి కన్నులు తడిచేసుకొనెను.

చారు ఇంత ఆత్రతగానుండుట చూచి భూపతి కొంచె మానందించి, కండువాలోనుండి తనరచనలతో నింపిన నోటు బుక్కును చారు ఒడిలోవేయుచు, "కోపగించకుము, చారూ, ఇదిగో తీసికొనుము," అని యనెను.

చదువు తొందరచే తరచుగ ఉత్తరములు వ్రాయజాలనని అమల్ తెలియచేసినప్పటికిని రెండు వారములు అతనిదగ్గరనుండి జాబు రాకపోగానే చారుకు సంసారము కంటకశయ్యగా నైనది.

ఆనాటి సాయంకాలము నానాకరకముల మాటల మధ్యను అతినిర్లక్ష్యముగా అనుచున్నట్లు, "ఇదిగో చూడు, సీమకు ఒక టెలిగ్రామ్ పంపించి కనుగొనుట మంచిది కాదా, అమల్ ఎట్లున్నాడో?" అని చారు అనెను.

"రెండువారముల క్రితమే ఉత్తరము వచ్చినది, చదువు తొందరలో ఉన్నాడు," అని భూపతి అనెను.

చారు—"అయితే మరియేల? విదేశములో ఒంటరిగా నున్నాడు, ఏమైన జబ్బుచేసినదేమో అని అన్నాను—జబ్బు చేయవచ్చును కదా!"

భూపతి—"జబ్బుచేసినయెడల మనకు తెలిసియుండును- టెలిగ్రామ్ ఖర్చుకూడ ఈమాత్రమాత్రము కాదు."

చారు—"అట్లాగునా? మహాఅయితే రూపాయి రెండు రూపాయిలకధికము కాదనుకొంటిని."

భూపతి— "అదేమి— నూరురూపాయిలకు తక్కువ కాదు!"

చారు—అట్లైన పంపుట అసంభవము."

మరి నాలుగు రోజులుగడచిన పిమ్మట చారు భూపతితో మాచెల్లిగారి గ్రామమునకు వెల్లి ఆమె ఎట్లున్నదో చూచి రాగలవా అని యడిగినది.

భూపతి—"ఏమి? చెల్లెలికి ఏమైన జబ్బుచేసినదా?"

చారు—"జబ్బుచేయలేదు, కాని నీవొకమారు వెళ్లిన యెడల నామె ఎంతో సంతోషించును—అది నీవెరుగనే ఎరుగుదువు."

చారు కోరిక ప్రకారము భూపతి గుర్రపుగాడీ తెప్పించుకొని హౌడాస్టేషన్‌కు బయలుదేరెను. దారిలో ఎడ్లబళ్ల వరస అడ్డుగ వచ్చుటచే తనగాడీ నిలిచిపోయినది.

అంతలో భూపతినిఎరిగిన టెలిగ్రాఫ్ బంట్రోతొకడు అతనిచేతిలో నొక టెలిగ్రామును పెట్టెను. విదేశమునుండి వచ్చిన టెలిగ్రామును చూడగానే భూపతికి భయము వేసినది—అమల్‌కు జబ్బుచేసినదేమోయని దిగులు పడుచు కవరు విప్పెను— "నేను బాగానే ఉన్నాను," అను మాటలు అందులోనున్నవి—అది అమల్ పంపిన టెలిగ్రామ్.

దీని అర్థమేమి యని భూపతి ఆలోచించెను—పరీక్ష చేసి చూడగా, తిరుగుజబాబుకు చార్జీ ముందు కట్టిపంపిన టెలిగ్రామ్‌కు అది జబాబు అని బోధపడ్డది.

హౌడా వెళ్లుట జరగలేదు. ఇంటికి తిరిగివచ్చి చారు చేతిలో ఆటెలిగ్రామ్ పెట్టెను. అతనిచేతిలో టెలిగ్రామ్ కనబడగానే చారు ముఖము తెల్లపారిపోయినది.

"దీని అర్థము తెలియలే"దన్నాడు భూపతి. కాని కొంత చర్చచేయగా అర్థము బోధపడ్డది. చారు నగయొకటి తాకట్టు పెట్టి రూపాయలు అప్పుచేసి టెలిగ్రామ్ పంపినది.

'ఇట్లుచేయుట కవసరమేమి వచ్చినది?' అని భూపతి తనలో తానాలోచించసాగెను. 'నన్ను అడిగియుండినయెడల నేనే టెలిగ్రామ్ పంపియుందునే—నౌకరును పంపించి రహస్యముగా నగతాకట్టుపెట్టి రూపాయిలు తెప్పించి ఈపని చేయుట మంచిది కాదే!'

'చారిట్లు చేసినదేల?' అను ప్రశ్న భూపతి మనస్సులోనికి మాటి మాటికి వచ్చుచుండెను. ఒక అస్పష్ట సందేహమతనిని బాధించుట మొదలుపెట్టినది. ఆ సందేహమును స్పష్టముగ పరిశీలించిచూచుట కతనికి ఇష్టము లేకపోయినది. దానిని మరువ ప్రయత్నించుచుండెను, కాని ఎంత ప్రయత్నించినను బాధ మనస్సును విడువలేదు.

అమల్ ఒంట్లో బాగున్నది, ఐనను జాబువ్రాయలేదు. ఇంత దారుణమైన విచ్ఛేదము ఎట్లు సంభవించ గలిగినది? అతని కళ్లఎదుట నిలుచొని ఆప్రశ్ననోటితో అడగవలెనని చారుకు బుద్ధి పుట్టుచుండెను. కాని మధ్యను సముద్రమున్నదేది—దాటి వెళ్లుటకు ఉపాయములేదే! ఎంత క్రూరమైన దా విచ్ఛేదము! సకలప్రశ్నలకు, అన్నివిధముల ప్రతీకారమునకు అతీతమైన విచ్ఛేదము!

చారు తనమనస్సును అధీనములో మరి ఉంచుకొనలేకపోయినది. ఎక్కడిపను లక్కడనే ఉండిపోవుచుండెను. ఒక్కపనిదైన తిన్నగ చేయలేకుండెను. సదా నిర్లక్ష్యముగను, పర

ధ్యానముగను ఉండుటచూచి అందరు గుసగుసలాడుచుండిరి, ఐన నామెకు చైతన్యమే కలుగలేదు.

ఉండిఉండి ఆమె హఠాత్తుగ ఉలికిపడుచుండెను; మాట లాడుచు మాటలాడుచు లేచి లోనికిపోయి ఏడ్చుచుండెను; అమల్ పేరు వినగానే ఆమె ముఖము వివర్ణమగు చుండెను.

చివరకు భూపతి సమస్తమును బోధపరచుకొనెను; ఊహించకూడనిది కూడ తుదకూహింప వలసివచ్చెను. సంసా రము సారహీనమైన ముసలి వస్తువై పోయినది.

భూపతి ఈనడుమ కొద్దిరోజులు ఆనందమువలన అంధుడై యుండెను. ఆదినములమాట జ్ఞాపకముతెచ్చుకొని ఇప్పుడు సిగ్గుపడసాగెను. వజ్రమెరుగని కోతికి మాయవజ్రమిచ్చి ఇట్లు మోసపుచ్చవచ్చునా? చారుమాటలు, ఆమె పనులు, ఆమె ప్రేమ—ఏవేవి భూపతిని భ్రమపెట్టుచుండెనో, అవియన్నియు ఇప్పుడతనికి, 'మూఢుడా మూఢుడా మూఢుడా,' అనుచు బెత్తు దెబ్బలు కొట్టుచుండెను.

చివరకు తానంత కష్టపడి అంతశ్రద్ధతో రచించిన వ్యాస ములు పద్యములమాట జ్ఞప్తికిరాగానే, భూపతి భూదేవిని ప్రార్థించెను—"నీవు కడుపు చీల్చుకొని నన్ను నీలో దాచు కొనుము తల్లీ," అని అంకుశముచే కొట్టబడుచున్నవాని వలె చారుదగ్గరకు పరుగెత్తిపోయి, "నా వ్యాసములేవీ?" అని యడిగెను.

చారు, "అవినా దగ్గరనే ఉన్నవి," అని యన్నది.

భూపతి, వానినిమ్మని యనెను.

చారు, భూపతికొరకు కచోడీలు వేయించుచు, "ఇప్పుడే కావలెనా?" అని యడిగినది.

"ఇప్పుడే కావలెను," అన్నాడు భూపతి.

చారు పొయ్యిమీదినుండి మూకుడును దింపి బీరువా తెరచి నోటుబుక్కును తీసి ఇచ్చినది.

భూపతి దానిని తొందర తొందరగా ఆమెచేతిలోనుండి లాగుకొని పొయ్యిలోనికి విసిరెను.

చారు కంగారుపడి, "అది ఏమి?" అనుచు దానిని బయటికి లాగబోయినది.

భూపతి, "వద్దువద్దు," అని గర్జించుచు చారుచేయి పట్టుకొనెను.

చారు నిర్ఘాంతపోయి చూచుచు నిలుచుండెను—కాగితములన్నియు కాలి భస్మమైపోయినవి.

చారు బోధపరచుకొన్నది; పెద్దనిట్టూర్పు విడిచినది; కచోడీ వేయించుట పూర్తికాలేదు, ఆమె మెల్లమెల్లగ ఇంకొక చోటికి వెళ్లిపోయినది.

చారు కన్నులయెదుట పుస్తకము కాల్చవలెనని భూపతి యుద్దేశించలేదు. ఐనను తన ఎదుటనే కాలుచుండెను, అది

పెట్టినది. అతడు మనస్సును అణచియుంచుకొనలేకపోయెను. వంచింపబడిన మూఢభూపతి వంచకురాలి యెదుటనే తన ప్రయాస ఫలమును మంటలో కలిపెను.

అంతయు బూడిదయైనది. అతనిలో అకస్మాత్తుగ పుట్టిన ఉన్మాదము శాంతించగానే, చారు తన అపరాధభారమును మోసుకొని, విచారముతో తలవాల్చుకొని, వెళ్లిపోవుటచూడ గానే భూపతికి తెలివివచ్చినది. భూపతి తలయెత్తి చూచెను— తనకు మిక్కిలి ఇష్టమని తలచి చారు స్వహస్తములతో తన కొరకు బహుశ్రద్ధగా ఫలహారము తయారు చేయుచుండెను.

భూపతి వరండాజాలుపై చేయిమోపి నిలుచొని తనలో తా నిట్లనుకొనుచుండెను— "చారు నా కొరకు ఎడతెరిపిలేక శ్రమపడుచున్నది. అతిజాగ్రతగా మోసముచేయ ప్రయత్నించుచున్నది— లోకములో ఇంతకంటె జాలిపడదగిన యవస్థ యేదియు నుండదు. ఈ మోసము కేవలము ఛలనాకారిణి యొక్క నీచకృత్యము మాత్రమే కాదు. ఆ నటన నటనకారిణి విక్షతహృదయముయొక్క బాధను నాలుగింతలు చేయు చుండును, ఆ అభాగ్యురాలు తన గుండెకాయను పిండి రక్తము నిచ్చుచుండును. ఓ అభాగ్యురాలా, ఓ దుఃఖినీ! ఇదియేమియు నా కవసరములేదే! ఇన్నాళ్లు నీప్రేమ నాకు దొరకక పోయినను దొరకలేదనికూడ నేను పోల్చుకొనలేక పోతిని. ప్రూఫులు దిద్దుట, వ్యాసములు వ్రాయుటలోనే నా దినములు గడచి

పోయినవి—వాకొర కివియంతయు చేయుచుండుట కేవల మనవసరము !"

పిమ్మట, డాక్టరు రోగిని ఏవిధముగా, ఎటువంటి సంపర్క మును లేనివానివలె, హృదయమునకు దూరమునసుంచి పరీక్ష చేయునో, భూపతి ఆదేరీతిని చారును పరీక్ష చేసెను. ఈ శక్తి లేని ఇల్లాలిహృదయము ప్రపంచముచే నలుదిక్కులనుండి ఆక్రమణచేయబడినది. తాను చెప్పకోరినదంతయు చెప్పవలెనన్న మిత్రుడొక్కడైన లేడు. చెప్పగలిగిన మాటలేదు. హృదయ మును వంపి బరువు తగ్గించుకొనగల స్థానములేదు. ఆమె అవ్యక్తదుఃఖము, తప్పించుకొనజాలనిది, నివారింపజాలనిది. రోజురోజుకు పెరుగుచుండు ఆ దుఃఖమును భరించుచు, హాయిగా కాలము గడుపుచుండు ఇరుగుపొరుగల వారివలె తనకును దుఃఖమేమియు లేనట్టు నటించుచు గృహకృత్యములు చేయుచుండవలెను.

భూపతి తన పడకగదిలోనికి వచ్చిచూచెను. కిటికీ కమ్ములు పట్టుకొని చారు బయటికి రెప్పపాటులేక చూచు చున్నది—కంట నీరులేదు. భూపతి మెల్లగ నామె దగ్గరకు వచ్చి నిలబడెను—ఏమియు ననలేదు—ఆమె తలపై చేయి యుంచెను.

"ఏమి సమాచారము ? ఆ సందడి ఏమిటి ?" అని భూపతిని మిత్రులడిగిరి.

"వార్తాపత్రిక——"

"ఇల్లువాకలి వార్తాపత్రికలో చుట్టపెట్టి గంగలో ముంచివేయవలెననా నీ సంకల్పము ?"

"ఈసారి పత్రిక నేను పెట్టుటలేదు."

"అట్లైన పెట్టువారెవరు ?"

భూపతి——"మైసూరులో ఎవరో ఒక క్రొత్తపత్రికను స్థాపించుచున్నారు, నేను దానికి సంపాదకునిగా వెళ్లుచున్నాను."

"ఇల్లు విడిచి మైసూరు వెళ్లిపోవుచున్నావా ? చారు కూడ నీతో వచ్చును కదా !"

"చారు ఇక్కడనే ఉండును——మేనమామ వచ్చి ఆమెతో నిక్కడ నుందురు."

"పత్రిక - వ్యసనము నిన్నింకా వదలలేదు !"

"ప్రతివానికి నేదోయొక వ్యసన ముండవలెను——కదా!"

వెళ్లిపోబోవునప్పుడు చారు, "తిరిగి యెప్పుడు వచ్చెద" వని యడిగినది.

భూపతి——"ఒంటరిగా నుండుట నీ కెప్పుడు కష్టముగా తోచునో నాపేరను వ్రాయుము——నీవెప్పుడు రమ్మనెదవో అప్పుడే వచ్చెదను."

భూపతి సెలవుతీసికొని వెళ్లిపోవుచు ద్వారముకడకు వచ్చునప్పటికి చారు వెనుకనుండి పరుగెత్తివచ్చి అతనిచేయి

గట్టిగా పట్టుకొని, "నన్ను నీతో తీసికొని పొమ్ము, నన్నొంట రిగా ఇక్కడ విడిచిపెట్టకుము," అని యన్నది.

భూపతి ఆశ్చర్యపడుచు చారు ముఖమువంక చూచుచు నిలుచుండెను. చారుచేయి వదలించుకొని భూపతి వరండాపైకి వచ్చి నిలిచెను.

అమలుని విచ్ఛేదస్మృతి ఆ యింటిని చుట్టుడించి తగులబెట్టు చుండెననియు, దవానలము మధ్యను చిక్కుకొన్న హరిణివలె చారీ యింట బాధచెందుచుండవచ్చుననియు భూపతికి తట్టినది. 'చారు తనమాటయే ఆలోచించుచుండెను గాని నా మాట ఆలోచించలేదే' అని భూపతి తనలో తాననుకొనెను. నాకు పారిపోవుటకు తావేది? సదా పరుని ధ్యానించుచున్న భార్యను విదేశమునకు పోయికూడ మరచుటకు నా కవకాశమీయ నక్కరలేదా? బంధుమిత్రహీన నిర్జన విదేశమునకూడ ఈమె నా దగ్గరనే ఉండవలెనా? దినమంతయు కష్టపడి పనిచేసి ఇంటికి తిరిగివచ్చి దుఃఖించుచు నిశ్చలముగ పడియున్న భార్యతో సాయంకాలము గడుపుచుండుట ఎంత బాధకర మగు బ్రతుకు! హృదయములో మృతభారమును మోయు చున్న భార్యను నాగుండెదగ్గర నుంచుకొని నే నెన్నాళ్లుండ గలను? ఇంక నెన్నాళ్లీ విధముగ నేను బ్రతికి యుండవలెనో కదా! విరిగి కూలిపడిన ఇంటి కర్రముక్కలను, ఇటుకముక్కల నైనను, విడిచిపెట్టి పోవుటకు వీలులేదా? వానినికూడ భుజ మునపై నుంచుకొని తిరుగుచుండవలెనా?

భూపతి తిరిగి లోనికి వచ్చి, "నిన్ను తీసికొని పోలే"నని చెప్పెను.

రెప్పపాటులో చారుముఖములోని రక్తము మాయమయి ముఖము తెల్లపారినది. చేతితో మంచముకోడును గట్టిగా పట్టుకొన్నది.

ఆమెనుచూచి భూపతి తత్‌క్షణమే, "నాతో పద, చారూ," అని అన్నాడు.

"వద్దు, అవసరము లేదు," అన్నది చారు.

.

# ప్రతీకారము

పూర్వము ముకుందబాబుగారి దివాన్‌గానుండిన గౌరీ కాంతుని మనుమరాలు ఇప్పటి మేనేజరుగారి భార్య. జమీందారుగారి దౌహిత్రి వివాహమునకు వారి ఆచారానుసారము 'వధువు-విందు' అను విందుజరిగినది. విందునాడు ఇంద్రాణి జమీందారుగారి యింటికివచ్చినది. కాని ఆ వచ్చిన ముహూర్తము మంచిదికాదు.

వెనుకటి కథ తెలిసినయెడల రాబోవునది స్పష్టముగ బోధపడును, కనుక వెనుకటి కథ కొంచెము వినవలెను.

కాలదేవుని ఆజ్ఞయగుటచే ముకుందబాబు అతని దివాన్ గౌరీకాంతులలో ఒక్కడును స్వస్థలమునగాని స్వశరీరమునగాని లేడు, కాని ఉన్నంతకాలము వారు అపరిమితమైత్రి కలిగియుండిరి. గౌరీకాంతుని తలిదండ్రులు చిన్ననాడే చనిపోయిరి; అతని ముఖముచూచినతోడనే ముకుందబాబుకు అతనిపై నమ్మకము కలిగి తనకున్న స్వల్పఆస్తికి అతనిని మేనేజరుగా నియమించెను. గౌరీకాంతుని నమ్ముటలో ముకుందబాబు పొరపాటుపడలేదని రానురాను స్పష్టమైనది. చెదపురుగులు మెల్లమెల్లగ కట్టుకొని వచ్చి పెద్దపుట్టను తయారుచేయురీతిని, స్వర్గమునుకోరువాడు పుణ్యమును కూడబెట్టురీతిని, గౌరీకాంతుడు విసుగువిరామము

లేక రాత్రింబగళ్లు శ్రమపడి యజమానుని ఆస్తిపెంపొందించెను. చివరకు తనతెలివితేటలను ప్రయోగించి ప్రక్కనుండు బాక్రాగాడియను పరగణాను చాలతక్కువవెలకు కొని యజమానుని యాస్తిలో కలిపినప్పటినుండి, ముకుందలాల్ బాబుగారు గొప్ప జమీందారులలో నొకరుగా పరిగణింపబడసాగిరి. ప్రభువుని యున్నతితోపాటు భృత్యునకుకూడ ఉన్నతికలిగినది. గౌరీకాంతుడు క్రమముగా పెద్దమేడకట్టించుకొనెను. పాడిపంటల తోను, పండుగపర్వములతోను ఇల్లు సదా కలకలలాడుచుండెను. తహసీల్దారుగా ప్రవేశించిన గౌరీకాంతుని ఇప్పుడందరును దివాన్‌జీ అని పిలుచుచుండిరి.

ఇది పూర్వపు చరిత్ర.

ఇప్పటి జమీందారు ముకుందబాబుగారి పౌత్య్ర పుత్రుడు - వినోదవిహారి. జమీందారుగారికి మేనేజరుగానున్న వాడు గౌరీకాంతుని మనుమరాలిభర్త అంబికాచరణుడు- ఉన్నతవిద్యనభ్యసించి మంచిశిక్షణముపొందినవాడు. దివాన్‌జీకి తనకుమారుడు రామకాంతునిలో నమ్మకముచాలక, ముసలి వయస్సున పనివిడిచిపెట్టవలసివచ్చినప్పుడు తనమనుమరాలిభర్త యగు అంబికకు తనపని అప్పచెప్పెను.

అన్నివిషయములలో జమీందారివ్యవహారములు పూర్వముమాదిరియే జరుగుచున్నను, ఒకచిన్నవిషయములో మాత్రము భేదము కనపడుచుండెను. పూర్వమువలెకాక ఇప్పుడు ప్రభుభృత్యులకుగల సంపర్కము కేవలము జమీం

దారి పనులతో సంబంధించిన సంపర్కమున మాత్రమే, హృదయ
సంపర్కముకాదు. పూర్వము డబ్బు చౌకగానుండెను. డబ్బు
తోపాటు అనురాగముకూడ సులభసాధ్యముగానుండెను
ఇప్పుడు డబ్బువెల అధికమయిపోయినది. దానితోపాటు హృద
యములోపుట్టుఅనురాగముకూడ అరుదైనదని అందరునెరి
నదే. బహుసన్నిహితులయెడలనే అనురాగములేని ఇప్పు
వారికి పరులయెడల అనురాగమెట్లుండగలదు?

ఇట్టి పరిస్థితులలో జమీందారుగారియింట జరుగబో
వివాహసంబంధమున నేడు విందుజరుగుచున్నది. జమీందా
గారి మనుమరాలికి పెళ్లి. దివాన్‌జీగారి మనుమరాలు, ఇంద్రా
జమీందారుగారియింటికి విందుకువచ్చినది. మానవప్రపంచమ
బహువింతయగుస్థలము, భగవంతుని రసాయనిక పరీక్షశా
వింతవింత చరిత్రలుగల మానవులందరు ఒక్కచోటగుంపుగూ
తమతమ చిత్రవిచిత్రజీవితములతో వారుఅక్కడ నిర్మిం
చున్న అపూర్వమైన ఇతిహాసములకు అంతులేదు.

ఈపెళ్లివిందునాటి ఆనందకార్యములో తోడ్పడి
వారిలో రెండు తరహాలమనుష్యులు, అవిరామముగ అల్లబడ
చున్న మానవజీవితజాలమున, ఒక క్రొత్తగ్రంధిని కల్పించి

అందరిభోజనములు ముగిసినకొంతసేపటికి ఇంద్రా
జమీందారుగారి యింటికివచ్చినది. వినోదునిభార్య, నయనతా
అంత ఆలస్యముగ వచ్చుటకు కారణమేమని ఇంద్రాణినిఅడ
గగా, ఇంటిపనులతొందర, దేహాస్వస్థత మొదలగు మూడ

నాలుగు కారణములుచెప్పినది. కాని అవి నిజమైన కారణములు కాకపోవుటచే విని ఎవ్వరును సంతోషించ లేదు.

ఇంద్రాణి తననోటితో చెప్పకపోయినను నిజ మందరు నెరిగినదే— ముకుంద బాబుగారు ప్రభువులు, ధనవంతులు— నిజమే. కాని కులగౌరవమునుబట్టిచూచినచో గౌరీకాంతునిది ఉచ్చస్థానము. తమది యున్నతస్థానమని ఇంద్రాణి ఎన్నడును మరువలేదు. వేళకువచ్చినచో ప్రభువులయింట భోజనము చేయవలసి వచ్చునేమోయను భయమే ఇంద్రాణి ఆలస్యముగా వచ్చుటకు కారణము. ఆమెయుద్దేశము పోల్చుకొని జమీందారుగారిభార్య ఆమెను భోజనముచేయుమని బలవంతపరచినది, కాని సులభముగ లొంగవలసినదికాదు ఇంద్రాణి, ఎన్నివిధముల ప్రయత్నించినను ఆమెచే భోజనముచేయించ లేక పోయినది.

ఈ కులగర్వమునుగురించియే ముకుంద బాబు గారికిని గౌరీకాంతునికిని వెనుకనొకమారు ఘోరమైనవాదముజరిగినది. ఆవాదమునుగురించి ఇక్కడకొంచెము చెప్పవలసియున్నది.

ఇంద్రాణి అతిరూపవతి. రూపవతులను చలనములేని మెరుపుతో సరిపోల్చిచూచుట మన దేశసంప్రదాయము. ఆ వర్ణన సాధారణముగా నిజముకాదు, కాని ఇంద్రాణిని మెరుపుతో సరిపోల్చివర్ణించుట అతిశయోక్తికానేరదు. ప్రబలవేగముగను, మహోజ్వలకాంతిని ఇంద్రాణి తన నిశ్చలగాంభీర్యములో అతిసునాయాసముగా కట్టిపెట్టిఉంచినట్లు చూచువారికి

స్పష్టమగుచుండును. మెరుపు ఆమె ముఖములోను, కన్నుల లోను, సర్వాంగములయందును నిశ్చలమయి సదా నిలిచి యుండునవి—దాని సహజ చపలతకు ఇక్కడ తావులేదు.

ఆమెచక్కదనమునుచూచి ముకుందబాబు ఆమెను తన పోష్యపుత్రునికి ఇచ్చి పెండ్లిచేయుమని గౌరీకాంతునితో ప్రస్తావించెను. ప్రభుభక్తిలో గౌరీకాంతుని * మించినవాడు లేడు. ప్రభువుకొరకు ప్రాణమునైన నీయగలవాడు. గౌరీకాంతు డిప్పుడు ఐశ్వర్యవంతుడు, తానేదికోరినను ప్రభువు నెరవేర్చు చుండెను. ఐనను అతనికి ప్రభువునెడలగలభక్తి ఏమాత్రమును తగ్గలేదు. ప్రభువునుగురించి సమక్షమునగాని పరోక్షమునగాని వినయముతో మాటలాడుచుండును. అతనియెడల వాస్తవమైన భక్తికలిగియుండెను. కాని ఈ వివాహమున కెంతమాత్రము సమ్మతింపలేదు. ప్రభుభక్తిని అణాపైసలతో చెల్లించుచుండు వాడు. అదేవిధముగా తన కులమునకుగల మర్యాదనుకూడ కాపాడుకొన కోరుచుండెను. కనుకనే ముకుందబాబుగారి కుమారునకు తన మనుమరాలిని ఈయనన్నాడు.

భృత్యుని ఈ కులగర్వము ముకుందబాబుకు అసంతుష్టి కలిగించినది. ఈ ప్రస్తావముద్వారా తనభక్తునియెడల తనకుగల ప్రసన్నతను వ్యక్తపరుపనాశించెను. గౌరీకాంతుడట్లు తలచక పోవుట చూచి ముకుందబాబు గౌరీకాంతునితో కొన్నాళ్లు మాటలాడుటమాని అతని మనస్సుకు బాధకల్గించెను. ప్రభువుని విముఖత గౌరీకాంతుని హృదయమును మృత్యుశల్యవలె

పోడుచుచుండెను. ఐనను మనుమరాలిని తలిదండ్రులులేని ఒక దరిద్రకులీనునబాలకునకిచ్చి పెండ్లి చేసి, కుర్రవానిని తన యింటనేడుంచుకొని అతనికి తనడబ్బుతో చదువుచెప్పించెను.

నేడు ప్రభువులయింటికివచ్చి భోజనముచేయనున్నది. ఈమె ఆ కులగర్వితుడగు తాతగారి మనుమరాలే! ఇదిచూచి ప్రభుపత్నియగు నయనతారహృదయము ప్రేమతో నిండలేదని చెప్పుట అనవసరము. నయనతారహృదయము అసూయతో నిండియుండుటచే ఇంద్రాణి ప్రతివిషయములో తన నవమాన పరచుచున్నదని ఆమెకు తోచుచుండెను.

ఇంద్రాణి మొదటి యపరాధము—ఆమె చక్కగా ముస్తాబయి ఒంటినిండ నగలతోవచ్చినది. ఇంత యాడంబరముగావచ్చి తాను యజమానురాలితో సమానురాలని చాటించుటకు అవసరమేమివచ్చినది?

రెండవ అపరాధము—ఇంద్రాణి సౌందర్యగర్వము— ఇంద్రాణి అపురూప రూపవతి, దానికేమియు సందేహము లేదు. తక్కువ పదవిలోనుండువారికి అంతరూపు అనవసరము కావచ్చును, వారికా రూపుండుట అన్యాయము కావచ్చును— కాని రూపునచూచుకొని ఇంద్రాణి గర్వించుచున్నదనుట కేవలము యజమానురాలి భ్రమ. అందమొక అపరాధముకాదు. అందకత్తెయని మన మెవరినైన నిందించపూనుకొనినచో సౌందర్యగర్వదోషము ఆమెపై మోపకమానము.

మూడవది ఆమెడంబము. ఆమెలో ఒకవిధమైన స్వాభావికగాంభీర్యముండెను. ఎంతో పరిచయముండు వారితోతప్ప ఒళ్లు రాసుకొని తిరుగునది కాదు. ఇంతే కాక ఏదో పనికల్పించుకొని అందరిదగ్గరకువచ్చి కేకలువేయుచు వారిచేయుపనులలో దూరు స్వభావము కాదామెది.

ఈ విధముగా కొన్ని సమూలకమైన కారణముల చేతను, కొన్ని అమూలకకారణములచేతను నయనతార మండిపడు చుండెను. ఇంద్రాణికి సిగ్గుతెప్పించకోరి ఆమెను సూచించుచు, "ఈమె మా మేనేజరుగారిభార్య" అని, "మా దివాన్‌గారి మనుమరాలు" అని నయనతార అనవసరముగ మాటిమాటికి నలుగురితో ననుచుండెను. యజమానురాలు పురికొల్పగా వేలుపుగాయయగు ప్రియదాసియొకతె అతిచనువుగా ఇంద్రాణి పైపడి, ఆమె నగలను పొగుడుచు, కంటెను బాజుబందులను చేతితో పట్టుకొని, "అక్కా ఇది గిల్టువేనా?" అని అడిగినది. ఇంద్రాణి చీకాకుపడక బహుశాంతముతో, "కావమ్మా, ఇత్తడివి," అనియన్నది.

నయనతార ఇంద్రాణిని పిలిచి, "ఇదగో చూడు, అక్కడ ఒక్కతెవే నిలుచొని ఏమిచేయుచున్నావు, ఈ ఫలాహారముల పళ్లెములు ఆ పల్లకీలో పెట్టిరమ్ము," అని అన్నది—ఆ దగ్గరనే ఒకదాసికూడ నిలిచియుండెను. ఇంద్రాణి దట్టమైన కనుబొమ్మల ఛాయలోనుండి తనఉదారదృష్టితో ఒక్కనిమిషముపాటు

నయనతారముఖమును చూచి, ఏమియుననక మిఠాయిపళ్లెము లను పట్టుకొని పల్లకీవైపు వెళ్లినది.

ఎవరికొరకై ఆ మిఠాయి పంపబడుచుండెనో ఆమె దానినిచూచి, "నీవెందుకు శ్రమపడవలెనమ్మా, ఆ దాసిచేతి కిమ్ము," అని యనెను.

ఇంద్రాణి సమ్మతింపక, "అందులో కష్టమేమున్నది?" అని యన్నది.

"అయితే నా చేతికే ఇమ్మమ్మా."

"వద్దు నన్నే తీసుకొనిపోనిమ్ము," అని ఇంద్రాణి యన్నది.

అనుచు అన్నపూర్ణ ఏవిధముగా అత్యంతప్రేమతో భక్తునికి అన్నదానముచేయబోవునో ఆదేవిధముగా నిశ్చలానురాగముతో మిఠాయిని పల్లకీలో నుంచి వచ్చినది.

పల్లకీ ఒక ధనీగృహవధువుది, ఆమెకు రెండునిమిషముల పాటే అల్పభాషిణియు మితహాసినియునగు ఇంద్రాణితో సంపర్కముకలిగినది. ఐనను ఆమెతో శాశ్వతమైత్రి నిర్మించుకొనవలెననుకోరిక ఆ అల్పసమయములోనే ఆ వధువులో పుట్టినది.

స్త్రీలకు సులభమైనది అవమానశరములు వర్షించుట. నయనతార ఇంద్రాణిపై అట్టిశరములు క్రోధముతో వర్షించినది. కాని ఇంద్రాణి వానిని తనకు తాకనీయలేదు. అకళంకతేజస్సుతో నిర్మించబడిన ఆమె దృఢకవచమునకుతగిలి అన్నియు ముక్కలు ముక్కలై నేలపడినవి. ఇదిచూచి నయనతార మరింత మండి

పడుచుండెనని కనిపెట్టి, ఇంద్రాణి ఎవరికంటను పడకుండ నెమ్మదిగ ఇంటికి వెళ్లిపోయినది.

౨

బహుశాంతతతో ఓర్చియుండువారే లోలోపల గొప్ప బాధననుభవించువారు. నయనతార చేసిన అవమానమును ఇంద్రాణి అతినిర్లక్ష్యముగా నిరాకరించినది. ఐనను ఆమె మనస్సు లోలోపల గొప్పబాధ పొందుచుండెను.

ఇంద్రాణిని వినోదవిహారికిచ్చి పెండ్లిచేయు ప్రస్తావము జరిగినట్లుగానే నయనతారను ఇంద్రాణిమేనత్తకొమారుడు, నిరుపేదయైన వామాచరణునికిచ్చి పెండ్లిచేయవలెనని ఒకానొకప్పుడు మాటలుజరిగినవి. ఆ వామాచరణుడే ఇప్పుడు వినోదవిహారికచేరిలో ఒక మామూలు గుమాస్తాగా నున్నాడు. ఇంద్రాణికి ఇప్పటికిని జ్ఞప్తియున్నది—చిన్నప్పుడొకనాడు నయనతారను ఆమెతండ్రి తమయింటికితీసుకొనివచ్చి వామాచరణుడు నయననెత్తైన వివాహమాడునట్లుచేయుమని గౌరీకాంతుని అతిదీనముగ వేడుకొనెను. ఆబాలికయొక్క అసామాన్యప్రగల్భతను కనిపెట్టి అంతఃపురస్త్రీలాశ్చర్యపడిరి. అమ్మాయి అకాలపక్వత వారికి కుతూహలము కలిగించినది. ఆమె యెదుట నోరుపెగలని ఇంద్రాణికి తానుచేతకానిదని తోచినది. అబాలికధోరణి, ఆమె అనర్గళముగా మాటలాడుచుండుట, చూచి గౌరీకాంతునికి ముచ్చటవేసినది. కాని అతడు శాఖాభేదముండుటచే వివాహమునకు మాత్ర మొప్పుకొన

లేదు. చివరకు నయనతారను అకులీనుడగు వినోదునకిచ్చియే పెండ్లి చేసిరి.

వెనుకటి ఈ సమాచారమంతయు జ్ఞాపకము తెచ్చుకొనుటవలన ఇంద్రాణికి మనఃశాంతి కలుగుటకుమారుగా, అవమానము మరింత బాధించినది. మహాభారతములో వర్ణించబడిన శుక్రాచార్యుని కన్య, దేవయానిమాటయు, శర్మిష్ఠ మాటయు ఆమెకు జ్ఞప్తికివచ్చినవి. దేవయాని ప్రభుకన్య శర్మిష్ఠదర్పమును చూర్ణముచేసి ఆమెను తనదాసిగాచేసికొన్నది. నయనతారకుకూడ అట్టిపరాభవము కలిగినచో తగిన శాస్తియగును. దైత్యగురువు శుక్రాచార్యులు దైత్యులకొకానొకప్పుడు అవసరమయియుండెను. అదేరీతిని తాత గౌరీకాంతుని సహాయము ముకుందబాబుగారి కుటుంబమునకు అత్యంతావశ్యకమైయుండెను. ఆరోజులలో గౌరీకాంతునకు బుద్ధి పుట్టియుండినచో ముకుందబాబును అతిదీనావస్థలో ఉంచియుండును. కాని అతడు వారియున్నతికొరకై పాటుపడి వారి సంపదపెంపొందింప రాత్రింబగళ్లు ప్రయత్నించి, వారిని పెద్దవారిగాచేసెను. కనుకనే ప్రభువులకు నేడామాట జ్ఞప్తియుంచుకొనుటకుకాని, గౌరీకాంతునియెడల కృతజ్ఞులైయుండుటకుగాని అవశ్యకత కనపడలేదు. 'బాంకాగాడి' పరగణా చౌకగా అమ్మకమునకువచ్చినప్పుడు గౌరీకాంతుడు సునాయాసముగా దానిని తానే కొనుక్కొనియుండవచ్చును. అట్లుచేయక దానిని తన యజమానునిపేరను కొని ఆతని యాస్తిని చాలరెట్లు పెంచెను.

ఇది కేవలము గౌరీకాంతుడు చేసినదానమనే చెప్పవచ్చును. ఐనను ప్రభువులయింట ఈమాట ఎవ్వరికిని జ్ఞప్తియే లేదే! "మాతాత గారుచేసిన దానమువల్లనే మనుష్యులనవమానపరచు అధికారము మీకు లభించినది," అని తనలో తాననుకొనుచు ఇంద్రాణి దుఃఖించుచుండెను.

ఇంద్రాణి ఇంటికి తిరిగివచ్చిచూచునప్పటికి భర్త, జమీందారుగారియింట పెళ్లివిందారగించి,ఆఫీసుపనులన్నియు ముగించుకొనివచ్చి పడకకుర్చీమీద వాలి వార్తాపత్రిక హాయిగా చదువుకొనుచుండెను.

భార్యాభర్తల స్వభావములు సాధారణముగా ఒకే మాదిరిగా ఉండునని అనేకులభిప్రాయపడుచుందురు. అట్టికలయిక బహుసముచితముగానూ సంగతముగానూ కనబడి మన హృదయములను ప్రీతితో నింపుచుండును, కనుక ఇట్టిదాంపత్యము అరుదైనప్పటికిని, ప్రతియింటను,ఉండునను భ్రమ మనలో పుట్టుచుండును. కాని కొన్నిముఖ్యవిషయములలో ఇంద్రాణి—అంబికాచరణుల స్వభావములు ఒకేమాదిరివి. అంబిక ఎవరితోను అంతగా కలసిమెలసియుండువాడు కాడు. పనిమీదతప్ప బయటికివెళ్లడు. తనపనిపూర్తిగా ముగించి ఇతరులుచేయవలసిన పనిని పూర్తిగా వారివల్ల రాబట్టుకొనుచుండును; పరులఆక్రమణమునుండి తప్పించుకొని, ఆత్మరక్షణముచేసికొనకోరుచు దుర్గమదుర్గమున ప్రవేశించునట్లు, ఇంటికితిరిగి వచ్చుచుండును. బయట తానూ, తనయధికారులపని; ఇంటిలో తాను, తన

ఇంద్రాణి—నీనికితప్ప అతని మనస్సులోగాని హృదయములో గాని మరిదేనికిని తావులేదు.

నగలతో గలగల్లాడుచు ఇంద్రాణి గదిలో ప్రవేశించగానే అంబికాచరణుడు పరిహాసముచేయుచు నేదో అనబోయెను కాని ఇంద్రాణిముఖము చూచి ఆపుకొని, ఆత్రతతో, "ఏమిజరిగినది!" అని అడిగెను.

ఇంద్రాణి తన మనోభారమును దులిపివేయ ప్రయత్నించి నవ్వుచు, "ఇంకేమి అవును? ప్రస్తుతము నాపతిరత్నదర్శనము లభించినది," అని అన్నది.

అంబికాచరణుడు వార్తాపత్రిక నేలపడవేసి, "అది నా కగోచరముకాదు; నేనుతెలియగోరుచున్నది తత్పూర్వము జరిగినదానినిగూర్చి," అని యనెను.

"తత్పూర్వము ప్రభువుభార్యయొద్దను ఆదరముపొందితిని," అని నెమ్మదిగ ఒక్కొక్కటిగ ఆభరణములనుతీయుచు భార్య జవాబుచెప్పెను.

"ఎటువంటి ఆదరము?" అని భర్త అడిగెను.

"నీవు నాకిచ్చు ఆదరము వంటిదికాదు," అని యనుచు ఇంద్రాణిభర్త పడకకుర్చీచేతిపైని కూర్చుండి అతని భుజములపై చేయివేసి మెడను కౌగలించుకొన్నది.

అటుపిమ్మట ఒక్కొక్కటిగ మెల్లమెల్లగ జమీందారుగారియింట జరిగినసంగతులన్నియు చెప్పినది. భర్తతో నేమియు చెప్పకూడదని నిశ్చయించుకొనియుండెను కాని, ప్రతిజ్ఞనిలు

పుకో లేకపోయినది. ఇంతకుపూర్వముకూడ అనేక తడవలు ఇదే రీతిని జరిగినది. పైవారిదగ్గిర మనస్సువిప్పి మాటలాడుట ఇంద్రాణికి ఎంతకష్టమో భర్తదగ్గర మనస్సులోనిదంతా వెళ్ళపుచ్చక యుండుట అంతకష్టము.

అంతయు వినినపిమ్మట అంబికాచరణునకు గొప్పబాధ కలిగినది. పట్టరాని కోపమువచ్చి, "ఇప్పుడే ఉద్యోగవిడిచి పెట్టెద" ననియన్నాడు. వినోదబాబుకు ఘాటైనఉత్తరము వ్రాయవలెనని లేచినాడు.

ఇంద్రాణి కుర్చీచేతిమీదినుండి లేచి నేల చాపపై కూర్చుండి భర్తఒడిలో చేయిఉంచి మందలించుచు నిట్లు చెప్పినది— "అంత తొందరపడవలసిన అవసరమేమి? ఇప్పుడెందుకు వ్రాయుట, రేపుదయము ఏదో ఆలోచించి నిశ్చయించవచ్చును."

"వద్దు ఒక్కనిమిషమైన జాలముచేయకూడదు," అని అంబికాచరణుడు ఉద్రేకముతో జబాబు చెప్పెను.

ఇంద్రాణి, పితామహుని హృదయమృణాలమున వికశించిన ఏకైకపద్మము. తాతగారి హృదయములోనుండి ప్రేమరసము పీల్చినట్లే ఆమె అతని మనస్సులోనుండి అనేక భావములను, తానెరుగకయే, తీసికొన్నది. ముకుందబాబుగారి వంశముయెడల గౌరీకాంతుని హృదయముననుండిన నిష్ఠ, భక్తి, పూర్తిగా ఇంద్రాణిమనస్సున అవతరించలేదు. కాని ప్రభువులహితమునకై జీవనమర్పించుట తమకర్తవ్య మను

మాట ఆమెమనస్సున బద్ధమూలమైయుండెను. అంబికా చరణుడు ఉన్నతవిద్యపొందినవాడు. కోరినచో వకీలయి డబ్బార్జించగలిగియుండును. అదికాక గొప్పఉద్యోగమేదైన సంపాదించుకొనగలవాడు. కాని భార్యదృఢసంకల్పముననుస రించి, ఏకాగ్రచిత్తతతో బహు ఆనందముగా వినోదుని ఎస్టేటు మేనేజరుగా ఉండి అతని ఉన్నతికై పాటుపడ నిశ్చయించు కొనెను. అవమానమువల్ల బాధపొందుచున్నను తనభర్త వినోద బాబుగారి ఉద్యోగము విడిచిపెట్టుటకుమాత్రము ఇంద్రాణి మనస్సు ఒప్పుకొనలేదు.

ఇంద్రాణి కొంచెమాలోచించి మృదుస్వరముతో నిట్లు న్నది — "ఇందులో వినోదబాబు దోష మేమున్నది? అత డేమియు ఎరుగడు, అతని భార్యమీద కోపమువచ్చి అతనితో పోట్లాటెందుకు?"

ఈమాట విని అంబికాబాబు బిగ్గరగా నవ్వెను. తన సంకల్పము తనకే మిక్కిలి హాస్యకరముగా కనపడి, "ఔను ఆ మాట నిజమే," అన్నాడు. "కాని అతడు నాప్రభువైనప్పటి కిని, ఇటుపై నెన్నడును నిన్ను వారియింటికి పంపను."

ఈ చిన్నతుపానుతో ఆనాటి మేఘము చెదిరిపోయినది. ఇల్లు యథారీతిని ప్రసన్నతతో కలకల్లాడుట ప్రారంభించినది. భర్తప్రేమలో మునిగి ఇంద్రాణి బయటి అనాదరణను పూర్తిగా మరచినది.

3

అంబికాచరణునిపై సంపూర్ణమగు నమ్మకముండుటచే వినోద విహారి జమీందారీపని తానేమియు చూచువాడుకాడు. ఏవిషయములోనైనను భార్యను సందేహించని భర్త సంపూర్ణవిశ్వాసముకోలది భార్యయెడల ఏవిధముగా బహునిర్లక్ష్యముగా నుండునో తన జమీందారీనిగురించి వినోదుని అశ్రద్ధకూడ రమారమి అదేమాదిరిగా నుండెను. జమీందారీ రాబడి వివరము స్థిరపడి, వసూళ్లు నిరాటంకముగా జరుగుచుండెను. సునాయాసముగ ఆదాయము వచ్చుచుండుటచే వినోదునకు దాని ఆకర్షణ పోయి, కుబేరుని భాండాగారమున ప్రవేశించు రహస్యపు సొరంగమార్గమొకటి కనిపెట్టవలెనను పిచ్చికోరికపుట్టినది. అనేకరకముల సలహాలపైని రహస్యముగ నానారకములవర్తకములలోనికి దిగెను. ఒకమారు దేశములోని తుమ్మచెట్లన్నియు కొట్టించి బండ్లకు చక్రములుచేయించ నిశ్చయించెను. సుందరవనములోని తేనెపట్లన్నియు గుత్తపాడి డబ్బుసంపాదించ నిశ్చయించె నొకసారి. మరియొకసారి పశ్చిమప్రాంతములనున్న కరక్కాయలు గుత్తపాడి లక్షలుసంపాదించ నిశ్చయించెను. బయటివారెవరైన వినినచో నవ్వుదురని ఎరిగి ఇట్టివ్యాపారముల సంగతి మిక్కిలి రహస్యముగ నుంచుచుండెను. ముఖ్యముగా అంబికాచరణునకు తెలిసిపోవునేమో యని అతడు సిగ్గుపడుచుండెను. నష్టము వచ్చునని భయపడి అంబిక నిరుత్సాహపరచునని వినోదుని సందేహము. అంబికాచరణుడే జమీందారుడయినట్లును, ఏవిషయములోను దూరక ఊరక

కూర్చొనియుండుటకైనయే అతనికి జీతము నిర్ణయమైనట్లు వినో దుని నడవడివలన అందరికిని తోచుచుండును.

విందయిన మరునాటినుండి నయనతార భర్తచెవిలో మంత్రోపదేశముచేయ మొదలుపెట్టినది: "నీవేమియు స్వయముగా చూచుకొనవు. అంబిక నీకెంత ఇచ్చునో దానినే అందుకొని తృప్తిపొందుచుందువు, లోలోపున ఎంతదోపుడు జరుగుచున్నదో ఎవరికిని తెలియదు," అని ఆమె అన్నది. "ఆ నాడు మీా మేనేజరుభార్య పెట్టుకొనివచ్చిన నగలు ఈ ఇంట నే నొక్కనాడైన చూడలేదు. ఆ నగలు ఆమెకెక్కడివి? అట్లు గర్వముతో విరిగిపడుచుండుటకు ఆమెకు ధైర్యమెట్లుకలిగినది?" ఇట్లనుచు, ఆనాడు ఇంద్రాణిపెట్టుకొనివచ్చిన నగలను ఇంతది అంతచేసి వర్ణించి, ఇంద్రాణి తన దాసితో చెప్పినదని ఎన్నో మాటలు కల్పించి భర్తచెవినివేసినది.

వినోదునిది దుర్బల స్వభావము. ఎవరినైన నమ్మి నిశ్చింతగా కూర్చొనలేడు, ఎవరేదిచెప్పినను నమ్మి ఇతరులను సందేహించుచుండును. మేనేజరు మోసపుచ్చుచున్నాడని అతని చెవినిపడగానే అతడు దొంగయను నమ్మకము ఒక్కక్షణములో దృఢమైపోయినది. ఏ వ్యవహారమునుగురించియు అతనికి ప్రత్యక్షానుభవము లేకపోవుటచేత, మేనేజరు అనేకవిధముల తనను మోసపుచ్చుచున్నాడని ఊహించుకొని భయపడెను. అయినను అంబికని మోసమును కనిపెట్టు మార్గమేదియు ఊహించలేక

పోయెను. మేనేజరుని ఏమైన అడుగుసాహసముకూడ అతనికి లేదు—ఎట్లు చూచినను చిక్కు గట్టిదే !

అంబికాచరణుని ఏకాధిపత్యము చూచి క్రింది ఉద్యోగస్థులందరికిని ఈర్ష్యకలుగుచుండెను. గౌరీకాంతుడు ఉద్యోగమిచ్చిన దూరపుమేనల్లుడు-వామాచరణునకు.-అంబికాచరణుని పై ఈర్ష్య అందరికంటె తీవ్రముగనుండెను. ఏవిషయములోను తనకు అంబికకు భేదము లేదనియు,బంధువుడై యుండికూడ అంబిక ఈర్ష్యకొలది తనను పైకి లేవనీయకున్నాడనియు వామాచరణుని నమ్మకము. ఉన్నత పదవి రాగానే ఆ పదవికితగిన శక్తిసామర్థ్యములు తమంతట తామే వచ్చునని వామాచరణుని మతము. ముఖ్యముగా మేనేజరుపని అతిసామాన్యమైనదని వామాచరణుడనేవాడు—పూర్వకాలమున రథముపై నెగురుచుండు పతాకమువంటివాడు మేనేజరు—గుర్రములు రథమును చచ్చి చచ్చి లాగుచుండును, పతాకమహాశయుడు మీదను హాయిగా గర్వముతో తలయాడించుచుండును.

ఏపని ఎట్లుజరుగుచున్నదని వినోదుడు ఇప్పటివరకు ఎన్నడును అడుగలేదు- డబ్బు పెద్దమొత్తమెన్నడైన అవసరమైనప్పుడు ఖజాన్‌జీ దగ్గరకు రహస్యముగావచ్చి ట్రెజరీలో ఎంత డబ్బు ఉన్నదని అడుగుచుండును. ఎంతమొత్తమున్నదో ఖజాన్‌జీ చెప్పినపిమ్మట పైవారి డబ్బునిమ్మని కోరుచున్నట్లు కొంచెము తత్తరపడుచు తనకు కావలసిన సొమ్మునడుగుచుండును. ఖజాన్‌జీ జమీందారుగారి సంతకముతో రశీదు

పుచ్చుకొని సొమ్మిచ్చుచుండును. అటుపిమ్మట కొన్నాళ్లవరకు వినోదవిహారి అంబికాచరణుని దగ్గర అతిసంకోచముతో సిగ్గు పడుచు మసులుచుండును; అంబికునికంట పడకుండయుండిన సుఖపడెద నన్నట్లు ప్రవర్తించుచుండును.

అంబికాచరణుడు మధ్యమధ్య చిక్కులలో పడుచుండెను. రూపాయిలు వసూలుకాగానే జమీందారుగారికి అతనివంతు పూర్తిగా ఇచ్చుచుండును. సర్కారు పేష్కసు నిమిత్తము, ఉద్యోగస్థులజీతములు మొదలగు అత్యవసరమగు ఖర్చులనిమిత్తము కావలసినది మాత్రమే మిగిలియుండును. ఈ సొమ్ములోనుండి ఖర్చుపెట్టుటవలన అనేకవిధముల కష్టపడవలసి వచ్చుచుండెను. ఈవిషయమై వినోదునితో మాటలాడుటకైనను అంబిక కవకాశముచిక్కునది కాదు. వినోదుడు దొంగవలె మేనేజరును తప్పించుకొని తిరుగుచుండువాడు. అంబిక జాబుమూలమున తన అభిప్రాయమును తెలియచేసినను ప్రయోజనము లేకుండెను. ముఖస్థముగా జబాబుచెప్పుట అవసరము లేనంతసేపు దేనికిని సిగ్గుపడువాడు కాడు వినోదుడు.

వినోదుని వ్యవహారము క్రమేణ మితిమీరుచుండుట చూచి అంబిక ఇనుపపెట్టెతాళముచెవిని తనయొద్దనుంచుకొనెను. అప్పటినుండి రహస్యముగ రూపాయిలు తీసుకొనుటకు వీలు లేకపోయినది. వినోదుడు ప్రభువైనను దుర్బలుడగుటచే మేనేజరుతో ఈవిషయమై ఏమియు ననలేకపోయెను. కాని అంబికాచరణుని ప్రయత్నములన్నియు వ్యర్థమాయెనవి. 'అలక్ష్మి'

సహాయపడుచున్నప్పుడు తాళముచెవులు దొరకకుండ చేసినంత మాత్రాన రూపాయిలు దొరకకుండ చేయలేము. తాళము చెవులు దాచియుంచుటవలన మేలునకుబదులు కీడుసంభవించినది. ఆకథ యథాసమయములో తెలిసికొనగలము.

అంబికుని ఘూర్తైన కాయిదావల్ల వినోదునికి క్రోధము కలిగినది. సరిగా ఆరోజులలోనే నయనతార అతనిలో సందేహా మును పుట్టించుటవల్ల అతనిమనస్సుకు కొంతహాయి కలిగినది. క్రింది గుమాస్తాల నొక్కొక్కనిని పిలిచి మేనేజరునుగురించి ప్రశ్నింపసాగెను. ఈ కార్యములో వామాచరణుడు ముఖ్య గు ప్తచరుడు.

గౌరీకాంతుడు దివాన్‌గా నున్నప్పుడు ఇరుగుపొరుగు జమీందారులతో బహుకఠినముగా వ్యవహరించి వారి జమీం దారీలలోనుండి ఆ స్తిని అనేకముగ తమ జమీందారీలో కలుపుకొనెను. కాని అంబికాచరణుడు అట్టిపని చేయ పూను కొనలేదు. పైగా ఇతరులపై దావాలువేసిన తరువాతకూడ వారితో రాజీపడి తగాదాలు సాధ్యమైనంతవరకు ఫైసలుచేసి కొన ప్రయత్నించుచుండెను. వామాచరణుడిటువంటి వానిని నిదర్శనముగా చూపించి, అంబికాచరణుడు శత్రుపక్షము వారి వద్దను లంచముపుచ్చుకొని వారితో రాజీపడి ప్రభువుకు నష్టము కలుగించుచున్నాడని చెప్పెను. వామాచరణుడు అదే నిజమని నమ్మసాగెను. చేతకానివాడు తప్ప లంచము దొరకునప్పుడు పుచ్చుకొననివాడుండడని అతని మతము.

అనేకులనోట రహస్యముగ నిట్టి వదంతులు వినుట వలన వినోదుని సందేహము బలపడినది, కాని అతడు బహిరంగ ముగ నేమియుచేయలేకపోయెను. దానికి మొదటి కారణము అతనికి సాహసము లేకపోవుట—ముఖమునెదుట ఎవ్వరిని ఏమియు నడుగలేదు. రెండవకారణము భయము—అంబికా చరణుడు జమీందారీనిగురించి సమస్తమును ఎరిగినవాడు, అతడు పగపట్టినచో ఎట్టి అనిష్టమునైన చేయగలడు.

చివరకొకనాడు నయనతార భర్త పిరికితనమునుచూచి మండిపడి, అతనికి తెలియకుండ అంబికాచరణునకు కబురుపంపి పరదా వెనుకనుండి ఈ విధముగా అన్నది—"నిన్నిక ఉద్యోగములో ఉంచము, వామాచరణునకంతయు అప్పచెప్పి నీవు వెళ్లిపోవచ్చును."

తనపై వినోదునితో నానారకముల పోటీలందరును చెప్పుచున్నారని అంబికుడు ఇంతకుపూర్వమే సూచావాచా తెలుసుకొన్నాడు. కనుక నయనతారమాటలు విని అతడంతగా ఆశ్చర్యపడక, వినోదునియొద్దకు తత్క్షణమేపోయి, "నన్ను ఉద్యోగము విడచిపొమ్మని నీకోరికయా?" అని అడిగెను.

"అట్లే ఎంతమాత్రముకాదు," అని తడబడుచు వినోదుడు జబాబు చెప్పెను,

"నామీద మీకేమైన సందేహమున్నదా?" అని అంబిక మరల నడిగెను.

వినోదుడు సిగ్గుపడి, “ఎట్టిసందేహమునులేదు,” అని తడబడుచు జవాబుచెప్పెను.

అంబికాచరణుడు నయనతారతో తనకు జరిగిన సంభాషణను గురించి ఎవరితో నేమియుననక, మామూలు ప్రకారము ఆఫీసుకువచ్చి తనపనిచేసుకొనెను. ఇంటికివచ్చి ఇంద్రాణితో కూడ నేమియుచెప్పలేదు. కొన్నిదినము లిట్లు గడచినవి.

ఈ పరిస్థితులలో అంబికాచరణునకు ఇక్కట్లు ఎక్కువై వచ్చుట తటస్థించినది. తీవ్రరోగము కాకపోయినను అతడు దుర్బలావస్థలో నుండుటచే చాలారోజులవరకు ఆఫీసుకు వెళ్ల లేకపోయినాడు.

ఆరోజులలోనే పేస్కేలుచెల్లించుట మొదలగు ముఖ్య కార్యముల ఒత్తిడి అధికముగా నుండుటచే అంబికాచరణుడు ఒకనాడు హఠాత్తుగా రోగశయ్యవిడిచి ఆఫీసుకు వచ్చెను.

ఆనాడతడు ఆఫీసుకువచ్చునని ఎవ్వరు ననుకొనలేదు. అందరును, “మీరు రింటికి వెళ్లండి, ఇంతజబ్బుతో పనిచేయ కూడదు,” అని యనిరి.

వారిసలహా వినిపించుకొనక అంబికుడు తన టేబులు యొద్దకు వచ్చికూర్చుండెను. గుమాస్తాలు గడబడపడి బహు శ్రద్ధతో తమతమ పనులలో మునిగియున్నట్లు నటించిరి.

అంబికాచరణుడు సొరుగుతీయగా అందులో ఒకకాగిత మైన కనపడలేదు; నిర్ఘాంతపోయి కాగితములేమైనవి అతడంద

రిని అడిగెను. ఆకాశమునుండి అప్పుడే ఊడిపడినట్లు అతిఅమా యకముగ అందరు చూచుచుండిరి. దొంగవచ్చి ఎత్తుకొని పోయెనో లేక భూతమువచ్చి తీసుకొనిపోయెనో ఎవ్వరును స్థిరపరచలేకపోయిరి.

అప్పుడు వామాచరణుడువచ్చి, "అనవసరముగా గొడవ చేయుదురేల? కాగితములన్నియు జమిందారుగారే స్వయ ముగా తీసికొనిపోయిరి—ఈ సంగతి అందరునెరిగినదే!" అని చెప్పెను.

అంబికుడు కోపమాపుకొని తెల్లపోయి, కారణమేమి అని అడిగెను.

"మేమెట్లు చెప్పగలము?" అని వామాచరణుడు, ఏదో వ్రాయుచున్నట్లు నటించుచు జబాబుచెప్పెను.

అంబికాచరణుడులేని శుభసమయమున వామాచరణుని ఉపదేశానుసారము వినోదుడు మారుతాళముచేయించి మేనే జరుగారిడ్రాయరును తెరచి అతని దొంగతనము కనిపెట్ట కోరి అంబికుని ప్రైవేటుకాగితములన్నియు తీసికొనిపోయెను.

కపటబుద్ధిగల వామాచరణుడు ఈరహస్యము దాచి యుంచలేదు.

ఇట్టి యవమానము జరిగినతరువాత ఉద్యోగములో ఉండుట ఉచితముకాదని అంబికుడు స్థిరపరచుకొనెను.

తాళము చెవినైనను తీయక అంబికుడు తత్క్షణమే లేచి వినోదుని కలుసుకోవలెనని బయలుదేరెను. వినోదుడు బయ

టికి రాలేదు, తలనొప్పిచే బాధపడుచున్నానని కబురుపంపెను. అంబికుడు తిన్నగ నింటికి వచ్చి మంచముపై కూలపడెను. ఇంద్రాణి తొందర తొందరగా భర్తదగ్గరకు పరుగెత్తివచ్చి అతని నోదార్చ మొదలుపెట్టినది. క్రమక్రమముగ ఇంద్రాణికి అంతయు తెలిసినది.

సౌదామినియొక్క సహజనిశ్చలత నేడామెలో కనబడలేదు. నీలిమేఘమువంటి కళ్లలో తీవ్రమగు వజ్రశిఖ పుట్టినది—"అట్టి భర్త కిట్టి అవమానమా! అంత విశ్వాసమునకీ బహుమానమా!"

ఆమె నిశ్శబ్దక్రోధ జ్వాలచూడగానే అంబికుని కోపము చల్లారిపోయినది. దేవి క్రోధమునుండి పాపిని తప్పించకోరుచు అతడు ఇంద్రాణిచేయిని పట్టుకొని మృదువుగా నిట్లనెను— "వినోదుడు క్షుద్రవాడు, అతనిది దుర్బల స్వభావము. నలుగురు చెప్పిన మాటలవల్ల మనస్సు చెడిపోయినది."

ఇంద్రాణి భర్తభుజములపై రెండుచేతులను వేసి అతనిని తనగుండెపై గట్టిగా నొక్కుకొన్నది. ఆమె నేత్రములలోనుండు కోపజ్వాలలారి బొటబొట నీళ్లు కారసాగినవి. ఎట్టి అన్యాయముగాని అవమానముగాని అతనిని అంటకుండునట్లు బాహుపాశములో అతనిని బంధించి హృదయదేవతయైన అతనిని తన హృదయమందిరములో దాచకోరినది.

ఉద్యోగము మానివేయవలెననియే అంబికాచరణుడు స్థిరపరచుకొనెను—నేడు దీని కెవ్వరును అడ్డుచెప్పలేదు. కాని

నమ్మకములేక ప్రభువే అతనిని ఉద్యోగములోనుండి తొలగించ కోరుచున్నప్పుడు తా నుద్యోగమును విడిచిపెట్టినచో ప్రభువుపై శాస్తి విధించుట ఎట్లగును? ఉద్యోగము విడిచిపెట్ట నిశ్చయించుకోగానే అంబికుని కోపము చల్లారిపోయినది; కాని పనిపాట్ల మధ్యను, సుఖశాంతుల మధ్యను ఇంద్రాణిహృదయములో కోపాగ్ని రవులుచునే యుండెను.

ఆ సమయమున జమీందారుగారి యింటినుండి ఖజా౯జీ వచ్చియున్నాడని నౌకరు కబురు తెచ్చెను. ఎదుట మాటలాడు సాహసములేని వినోదుడు మేనేజరును ఉద్యోగము మానుకొమ్మని ఖజా౯జీద్వారా కబురుపంపెనని అంబికు డనుకొనెను. కనుక తానే ఉద్యోగము విడుచుచున్నట్లు తెలియపరచుచు ఉత్తరమొకటి వ్రాసి ఖజాన్‌జీచేతిలో పెట్టెను.

దీనివిషయమై ఏమియుననక, "ఘోర విపత్తు సంభవించినది," అని ఖజా౯జీ అనెను.

"ఏమి జరిగినది?"

అంబికాచరణుడు వినోదుని మంచికోరి అనవసర ఖర్చులకతనికి సొమ్ము దొరకకుండునట్లు అంబికుడు చేసినప్పటినుండి, వినోదుడు దొరకినచోటెల్ల అప్పుచేయుట ప్రారంభించెను. ఒకటైనతరువాత నొకటి క్రొత్తక్రొత్త వ్యాపారములు రహస్యముగ ప్రారంభించుచుండెను. నష్టపోవుచున్న కొలది పౌరుషమధికమగుచుండెను. ఒక వర్తకములో వచ్చిన నష్టమును దిద్దుకొనగోరి మరి ఒక క్రొత్తవర్తకము ప్రారంభించుచుండెను. ఇట్లు

పోనుపోను కొంచెము కొంచెముగా ఆ కంతము ఋణములో మునిగిపోయెను. అంబికుడు జబ్బుతో పడియున్నప్పుడు వినోదుడు ఖజానాలోని డబ్బంతయు తీసికొనెను. చివరవరకు బాంకా గాడి పరగణాకూడ పొరుగు జమీందారుకు తనఖాగా ఈయబడినది. ఆ జమీందారు వడ్డీ బాగా పెరగనిచ్చి దావా చేసి డిక్రీ పొందుటకు సిద్ధముగానున్నాడు. ఇప్పుడు నెత్తిమీద పడబోవుచున్న విపత్తిదియే!

విని అంబికుడు నిర్ఘాంతపోయి ఏమియును ననలేక, కొంత సేపటికి జవాబుచెప్పెను. "ఏమిచేయుటకు తోచకున్నది, ఆలోచించి రేపు చెప్పెదను." ఇట్లని ఖజాన్జీకిచ్చిన రిజగ్నేషన్ కాగితము తిరిగి తీసుకొనెను.

అంబికాచరణు డంతఃపురములోనికివచ్చి ఇంద్రాణికి సమాచారమంతయు సవిస్తరముగ తెలియచేసి, "ఈ పరిస్థితులలో నేను ఉద్యోగము మానలేను, "అని చెప్పెను.

ఇంద్రాణి చాలసేపటివరకు రాతి విగ్రహమువలె నిశ్చలముగ నిలబడిపోయినది; తనలోపల రేగుతున్న విరోధమును కాళ్లక్రింద పూర్తిగా క్రుమ్మి చివరకు, "ఔను ఇప్పుడెట్లు మానగలవు?" అని యన్నది.

తరువాత రూపాయిలకొరకు అనేక ప్రయత్నములు జరిగినవి. కాని అవసరమున్నంత డబ్బు జతపడలేదు. అంతఃపురములోనికిపోయి భార్య యాభరణములు తెమ్మని అంబికుడు వినోదునకు సలహా ఇచ్చెను. ఇంతకుపూర్వము వర్తకమున

కనకపుష్పనప్పుడు వినోదుడా ప్రయత్నము చేసియుండెను—కాని కృతార్థుడు కాలేదు. ఇప్పుడు తిరిగి లోనికివెళ్లి మంచి మాటలాడి, ఎంతో దీనముగ వేడుకొనెను. కళ్ల నీరుపెట్టుకొని దుఃఖించుచు ఆభరణభిక్షకై ప్రార్థించెను. నయనతార హృదయము కరగలేదు. ఎటువైపుచూచినను అప్పులే. తమ యాస్తి అంతయు ఇతరులపాలై పోవుచున్నది. నయనతారకు చివరకు మిగులునది ఈ నగలుమాత్రమే. కనుక ఏదెట్లు జరిగి నను నగలనుమాత్రము విడువకూడదని నిశ్చయించుకొని ఆఖరి పట్టు పట్టుకొని కూర్చున్నది.

ఎంతప్రయత్నించినను ఎక్కడను రూపాయలు దొరక లేదు. పగతో మాడియున్న ఇంద్రాణిముఖమున ఆనందరేఖ యొకటి కనిపించినది; భర్తచేయిని పట్టుకొని "నీవు చేయగల దంతయు చేసితివి. మరి నీ కర్తవ్యమేమియు లేదు, నిశ్చింతగా కూర్చుండుము. జరుగవలసినది జరుగక తప్పదు కాదా?" అని యన్నది.

భర్త యవమానమువలన సతిహృదయమున పుట్టిన రోషానలము ఇప్పటికి ఆరలేదని కనిపెట్టి అంబికాచరణుడు తనలో తాను నవ్వుకొనెను. ఆపదసమయములో దిక్కు మాలిన బాలకు డేరీతిచేయునో ఆరీతిని కేవలము తనమీదనే ఆధారపడియున్న వినోదునిచూచి అంబికునకు జాలికల్గినది. తా నతనిని ఇప్పు డెంతమాత్రము పరిత్యజించలేడు. తన యాస్తిని

తనకాపెట్టి వినోదని రక్షించవలెనని చూచెను. కాని "మన ఆ స్త్రీమీద చేయివేయకూడదు, వట్టు!" అని అన్నది ఇంద్రాణి.

అంబికాచరణుడు అమిత కలవరపడెను. ఇంద్రాణికి మంచిమాటలతో బోధపరచవలెనని ఎంతో ప్రయత్నముచేసెను, కాని ఇంద్రాణి అతనిని మాటాడనీయలేదు. చివరకు అంబికుడు ఆశవదలుకొని కూర్చుండెను.

ఇంద్రాణి ఇనపపెట్టె తెరచి తన నగలను ఒక్కొక్కటిగ తీసి పెద్దపళ్లెములో కుప్పపెట్టినది. ఆ భారీ పళ్లెమును రెండు చేతులతో పట్టుకొని భర్తయెదుటికి వచ్చి అతని పాదముల దగ్గర ఉంచినది.

పితామహుని ఏకమాత్ర ప్రేమధనమైన ఇంద్రాణి పుట్టిన నాటినుండి ఏటేట తాతగారిచ్చిన విలువైన కానుకలు కూడబెట్టియుంచినది. భర్త మితవ్యయము చేయువాడు, అతడు మిగల్చగల రూపాయన్నియుకూడ, ఈ సంతాన హీన రమణియొక్క భాండాగారమున ఆభరణరూపముగ రూపాంతరము పొందుచుండెను. ఆ సువర్ణమణి మాణిక్యములను భర్తయెదుట నుంచి ఇంద్రాణి ఇట్లనెను: "మా తాతగారు తన ప్రభువుకు దానముచేసిన బాంకాగాడి పరగణా ఈ నగలతో కొనితిరిగి ప్రభువంశమునకు దానముచేసెదను."

ఇట్లనుచు ఇంద్రాణి తన తడి కన్నులనుమూసి తలవాల్చి ఊహించుకొన్నది. వృద్ధ పితామహు డామె ఊహానేత్రము

నకు ఆ ముహూర్తమున ప్రత్యక్షమాయెను. శుభ్ర కేశ రాశి, ప్రేమమయహాసము, ధీ-ప్రదీప్తమైన ఉజ్జ్వల గౌరవర్ణ ము-పితామహుడు అక్కడ ఆక్షణమందు నిలుచొని ఆత్మాదరముతో తన చేతులను ఇంద్రాణి తలపైనుంచి ఆమెను దీవించసాగెను. బాంకాగాడి తిరిగి వేలాములో కొనబడినది. పతిజ్ఞా భంగముచేసి ఇంద్రాణి తిరిగి ప్రభువుల యింటికి విందుకు వచ్చినది. ఆమె ఒంటిని ఒక్క నగ లేదు. ఎవరికిని అవమానము కలుగ లేదు. ఎవరిమనస్సుకు బాధకలుగ లేదు.

---

స్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
ముద్రితము.—10-2-1955.

# విశ్వభారతి గ్రంథమాల

**రవీంద్రనాథ ఠాకూర్ రచన:**

| | | | |
|---|---|---|---|
| యోగవియోగములు (నవల-510 పుటలు) | 4 | 8 | 0 |
| పడవమునుక (నవల 560 పుటలు) | 5 | 0 | 0 |
| ,, 1-భాగం 280 ,, | 2 | 8 | 0 |
| ,, 2-భాగం 280 ,, | 2 | 8 | 0 |
| ఇంటాబయట నవల ... | 4 | 0 | 0 |
| ప్రాయశ్చిత్తము ,, ... | 3 | 0 | 0 |
| గృహప్రవేశం నాటకం ... | 1 | 4 | 0 |
| పోస్టాఫీస్ ,, ... | 0 | 12 | 0 |
| కథాగుచ్ఛము మొదటిభాగం ... | 2 | 8 | 0 |
| కథాగుచ్ఛము రెండవభాగం ... | 2 | 8 | 0 |
| కథాగుచ్ఛము మూడవభాగం ... | 2 | 8 | 0 |
| ,, ,, ప్రథమఖండం | 1 | 4 | 0 |
| ,, ,, ద్వితీయఖండం | 1 | 4 | 0 |
| కథాగుచ్ఛము నాల్గవభాగం అచ్చులోనున్నది | 2 | 0 | 0 |
| కథాగుచ్ఛము ఐదవభాగం ,, | 2 | 8 | 0 |
| కథాగుచ్ఛము ఆరవభాగం ,, | 2 | 8 | 0 |
| చతురంగము ,, | 1 | 8 | 0 |
| **నిరుపమాదేవి రచన:** అన్నపూర్ణమందిరము నవల | 3 | 0 | 0 |

**మారిస్ మేతర్ లింక్:**

(నోబెల్ ప్రైజ్‌పొందిన బెలిజియం దేశపు కవి)

| | | | |
|---|---|---|---|
| స్టిల్ మాండ్ మాజిస్ట్రేట్—నాటకం ... | 1 | 0 | 0 |
| **శరత్ చంద్ర చట్టోపాధ్యాయ**—చిన్నక్క— | 0 | 8 | 0 |
| వదిన; దొడ్డమ్మ | 1 | 8 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు 3372 — 292, ఎస్ప్లనేడ్. చెన్నపురి.